# ఉత్తరాలు

### ప్రత్యేక సంచిక

"వినాయక చవితి" ప్రత్యేక సంచిక ఆంధ్రపత్రిక నన్ను చాలా ఉత్తేజపరచినది. "పింగళి సుశీలాదేవి" గారు వ్రాసిన "తొలగిన తెరలు" కథ చాలా బాగుగా వున్నది కాని కథలో సహజత్వం వుట్టిపడటంలేదు. అయినా సంసారం గాజుపాత్ర లాంటిది. దానిని వాడుటకు కుడి, యెడమ చేతులు ఎటువంటివో సంసారమనే పాత్రకు భార్య, భర్త రెండు చేతుల వంటివారు. అందువలన వారి యిద్దరిలో ఓర్పు, సహనం అవసరం. ప్రతి చిన్న విషయాన్ని పెద్ద విషయమునుగా చిత్రించుటయే మానవులలోని బలహీనత కావున యీ కథ చాలా బాగుగానే వున్నది. చివరికి కథను సుఖాంతము చేసినందుకు సంతోషించుచున్నాను.

చిట్టూరి జగన్నాధరావ్ (జులూరుపాడు)

### కథలు

"మయూర్" గారి "పరిమళ నవ్వింది" కథ చిన్నదైనా బాగుంది. చివరికి అందరూ నవ్వటముతో కథ ఇంకా బాగుంది.

ఎం. శంకరయ్య (సూర్యాపేట)

### వ్యాసాలు

'హిందీ రాజకీయాలు' వ్యాసము వల్ల చాలా విషయాలు నేను నా స్నేహితులు తెల్సుకోగలిగాం. అందుకు 'ఆంధ్రపత్రికకు', 'మెంబిన్ స్ట్రీమ్' వారపత్రికకు మేము చాలా ఋణపడి ఉన్నాము.

ఉన్నవ విజయలక్ష్మిగారి "అర్ధాంగి" సీరియల్ చాలా రసవత్తరంగా ఉంది.

ఎం. ఎ. అప్పారావు (హింజిల్‌కట్)

### కార్టూన్

వినాయక చవితి సంచికలోని కార్టూన్లు నన్ను కడుపుబ్బ నవ్వించినవి. చిత్రకారులకు నా ధన్యవాదాలు. ఈ వారం కథలన్నీ బాగున్నాయి. నా సందేహం ఏమిటంటే రచయిత "కాలకలూరి", లోగడ "మలుపు తిరిగింది" కథ రచయిత "ఇనాక్" ఒకరేనా?

* ఒకరే

గోరంట్ల అనంతపద్మనాభయ్య (అనంతపురం)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 7–10–66
పరాభవనామ సం॥ భాద్రపద మాసం బ॥ సప్తమి
సంపుటము . 59 సంచిక . 4
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

క్రొత్తరేట్ల ననుసరించి 14–1–1966 మొదలు ఆంధ్రసచిత్ర వారపత్రిక చందా వివరాలు.

భారతదేశం

| | పోస్టుద్వారా రూ. పై. |
|---|---|
| సంవత్సర చందా | 19.25 |
| 6 మాసముల చందా | 9.62 |
| 3 మాసముల చందా | 4.80 |

ఇతర దేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 32.00 |
| అర్థసంవత్సర చందా | 16.00 |


## రచయితలకు మనవి

మా కార్యాలయం చేరే ప్రతిరచనతోనూ దానిరచయిత గాని, రచయిత్రిగాని అది తమ స్వంతరచ నేననీ, దేనికీ అనుకరణ కాదని హామీ వ్రాసి పంపాలి. ఇటువంటి హామీలేని రచనలను ప్రచురణకి స్వీకరించ లేము.

సంపాదకుడు
ఆంధ్రసచిత్రవారపత్రిక.

# మన లో మాట

ఈ సంచికలో మద్రాసు పరిశ్రమలశాఖ మంత్రి శ్రీ ఆర్. వెంకట్రామన్ రాసిన వ్యాస శీర్షిక ప్రారంభిస్తున్నాము. అఖిల భారత కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజ్ తో రష్యా, ఇతర కమ్యూనిస్టుదేశాలు పర్యటించిన శ్రీ వెంకట్రామన్ పేరుమోసిన కార్మిక సంఘ నాయకులు, న్యాయవాది. ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనయిజేషన్‌వారి 42 వ సమావేశానికి భారతప్రతినిధివర్గానికి నాయకుడుగా జెనీవా వెళ్ళారు. అయిక్యరాజ్యసమితి సభలో చాలాసంవత్సరాలు భారతప్రతినిధిగా ఎన్నిక అవటమేకాక అయిక్యరాజ్యసమితి 'ఎడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్' సభ్యులుగా ఎన్నిక అయ్యారు. కొంతకాలం క్రితం శ్రీ వెంకట్రామన్ భారతరాజ్యాంగంలో కొన్ని మార్పులు సూచించినప్పుడు వాటికి అంత ర్జాతీయంగా కూడా ప్రచారం లభించింది.

శ్రీ వెంకట్రామన్ వ్యాసాలు ప్రస్తుతం తమిళ వార పత్రిక 'ఆనందవికటన్' లో పడుతున్నాయి. ఆ పత్రిక సౌజన్యంతో వాటిని ఆంధ్ర సచిత్రవారపత్రిక పాఠకులకి అందచేస్తున్నాము...

* * *

ఈవారంతో 'అర్ధాంగి' నవల అయిపోతుంది...శ్రీ శ్రీకృష్ణ విదేశయాత్ర ముగించుకునివచ్చి తమ 'న్యూఢిల్లీలేఖ' పంపటం మొదలు పెట్టారు... 'అనిలా ఖన్నా' గురించి రాసిన శ్రీమతి ఉషారాణిభాటియా వ్యాసం మరొకటి పాఠకులకి అందచేస్తున్నాము...

* * *

'ఇల్లాలు' చిత్రంద్వారా తెలుగుతెరకు పరిచయమైన శ్రీ కె. వి. నాగేశ్వరరావు కథారచయితగా ఈ సంచికలోని 22 వ పేజీలో ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకులకు పరిచయమవుతారు...

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : నటి భారతి



ఎన్నికల టికెట్లు
నేను ప్రతి ఒకక్క కాంగ్రెస్ వ్యక్తికీ టికెట్ ఇవ్వ లేను
కేరళలో కాంగ్రెస్ వ్యతిరేక వామపక్షాలు
ఆది ఏ పెట్టుబడి దారూ చేస్తున్నది కాదు అంతా రెడ్ గార్డ్ లపనే
రెడ్ గార్డులు
చైనా ప్రజలు
ఇప్పుడు నీ కష్టాలన్నీ గట్టెక్కుతాయి
బంద్
ప్రజలు
ప్రతిపక్షాలు

శ్రీకృష్ణ

# ప్రభుత్వపరిపాలన - ప్రతిపక్ష విధానము

ఇటీవల ముగిసిన పార్లమెంటు సమావేశం ప్రధాన మంత్రి ఆర్థిక సలహాదారులైన వారిపై, ముఖ్యంగా దాక్షిణాత్యులైన శ్రీయుతులు సుబ్రహ్మణ్యం, భూతలింగాలపై దండయాత్ర సాగించిందని చెప్పాలి. ఈ దండయాత్రకు కావలసిన సాధన సామగ్రిని పబ్లిక్ అక్కౌంట్స్ కమిటీ సమకూర్చి పెట్టింది. దీనికి అధినేత కాంగ్రెసు పార్టీలోని మార్వారీ వణిక్ప్రముఖుడు శ్రీ ఆరార్ మొరార్కా. వీరు రాజస్థానానికి చెందిన వారు. మొరార్జి దేశాయి అనుయాయుల్లో ఒకరని కూడా తెలుస్తూనే వుంది.

1962 పార్లమెంటును దృష్టిలో వుంచుకున్నట్లయితే, అప్పుడు శ్రీ నెహ్రూ హిందీలో ప్రమాణ స్వీకారాన్ని చేసి వున్నారు. శ్రీ సి. సుబ్రహ్మణ్యం తమిళంలో చేశారు. మళ్లీ 1966 లో శ్రీ సుబ్రహ్మణ్యం రాజీనామా యిచ్చారు. దానికి కారణం హిందీని అందరి మీద రుద్దడం. కేంద్ర సచివాలయంలోని దక్షిణ ప్రాంతానికి చెందిన కార్యదర్శులు, ఉప కార్యదర్శులూ ఈ ప్రభుత్వ విధానానికి నిరసన తెలియ పరిచి వున్నారు. ఈ బలవంత పద్ధతికి వారి విరుద్ధ భావాన్ని ప్రకటించారు. దానితో భాషా చట్టానికి సవరణ తీసుకు రాబడింది.

కేంద్ర మంత్రి వర్గ కార్యదర్శి మహా రాష్ట్రానికి చెందినవాడు. ప్రత్యేక కార్యదర్శి పంజాబు రాష్ట్రానికి చెందినవాడు. రక్షణోత్పత్తిశాఖ కార్యదర్శి పంజాబు దేశస్థుడు. రక్షణ సరఫరాశాఖ కార్యదర్శి గుజరాతీ. ఇవికాక విద్యాశాఖ, దేశీయాంగశాఖ, విదేశీయాంగశాఖ, ఆర్థిక శాఖ, ఆరోగ్యశాఖ, పరిశ్రమల శాఖ, వాణిజ్యశాఖ, ఖనిజ శాఖ, ప్రభుత్వ యంత్రాంగము, రసాయనాలు, సరఫరా సాంకేతికశాఖ, రవాణా తదితర ముఖ్యమైన శాఖలన్నీ హిందీ ప్రాంతాల వారి అధీనంలో వున్నాయి.

ఒక్క ఆర్థిక శాఖలో మాత్రమే యిద్దరు దక్షిణ దేశంవారున్నారు. వారిలో ఒకరు శ్రీ భూతలింగం మరొకరు శ్రీ గోవిందన్‌నాయర్. మరో బెంగాలీ శ్రీ ఆర్. సి. దత్ కూడా ఈ శాఖలో వున్నారు.

కేంద్ర సచివాలయంలో హిందీని నిరభ్యంతరంగా ప్రవేశపెట్టడానికి అనుకూల వాతావరణం వుంది. ఆ ప్రాతిపదిక మీద హిందీ భాషా రాష్ట్రేతర ప్రాంతాలైన ఆంధ్ర, కేరళ, మైసూరు, మద్రాసు, బెంగాల్ రాష్ట్రాల్లో యిది నిర్బంధం చేయడంలో అర్థంలేదు. మన ఆంధ్రప్రదేశ్‌కు చెందిన యిద్దరు మంత్రులు కేంద్రంలో వున్నారు. వారు కేంద్ర సచివాలయంలో ప్రవేశపెట్టిన ఈ నిర్బంధ భాషా విధానానికి ఎంత వరకు సమ్మతిస్తారో తెలియదు. కేంద్ర సచివాలయంలో హిందీభాషా రాష్ట్రేతరులపై చూపిస్తున్న సవతి తల్లి ప్రేమను కాదన గలరా? తొందరలోనే కేంద్ర సచివాలయం హిందీ వారి హస్తగతం కానున్నదని వారు గుర్తించలేదా? గుర్తించి కూడా కేంద్ర ప్రభుత్వోద్యోగాలపై మావారికి అంతగా అభిలాషలేదు అనే వాదానికి దిగనున్నారేమో తెలియదు. కేవలం కొద్ది ఉద్యోగాలని మాత్రమే దృష్టిలో వుంచుకోకుండా మొత్తం ఈ 'రుద్దడం' విధానాన్ని పూర్తిగా పరిశీలించడం అవసరం. కేంద్ర సచివాలయాన్ని గమనించినపుడు 'ఐక్య భారత రాజ్యం' కళ్లకు కట్టినట్టు కనిపించాలని ఈ విధానం అవలంబించబడింది అంటున్నారు. మరో విషయమేమిటంటే దక్షిణ ప్రాంతాన్ని విడదీసి దానిమీద తమ స్వంత నిబంధనల్ని మొట్టమొదటా మనుకోవడం. సంవత్సరం క్రితం దక్షిణ ప్రాంతం ఒక్కతాటిమీద నిలబడింది. దానికి బెంగాల్ ప్రోత్సాహ బలం కూడా వుంది. అధికార ప్రాబల్యం—కోసం ప్రాకులాడే యీ రాజకీయ క్రీడా రంగంలో శ్రీమతి గాంధి ప్రధానిగా ఎన్నిక అయిన తరువాత కూడా యీ ఐక్యత కుంటుపడలేదు.

ప్రభుత్వంలో అధికారయుతమైన స్థానాల్లో దాక్షిణాత్యులే వున్నారని వాదించడానికి కూడా అవకాశం లేకపోలేదు. మొదట్లో, సంతకాల సేకరణలోను, ముఖ్యా వారీ ఆందోళనలలోను ఈ రాష్ట్ర పరిమితమైన భావాలు మరుగున పడుతున్నాయనే చెప్పాలి. ఉత్తర దక్షిణ ప్రాంతాల నియమిత భావాలు ఇందిరాగాంధి పరిపాలనలో కనుమరుగవుతున్నాయి. మళ్లీ ఉత్తరాది వారి తెలివి తేటలు అక్కడక్కడ ప్రదర్శింపబడుతూనే వున్నాయి. దక్షిణాది వారిని చిన్నచూపుచూడడం జరుగుతూ వున్నది. ఇందిరాగాంధి ప్రభుత్వాన్ని పడగొట్టాలనుకున్న వ్యతిరేక పక్షం వారు భాషావాదాన్ని ఆయుధంగా దొరకబుచ్చుకుని యింటా బయటా ఏకడం మొదలెట్టారు. దానితో కాంగ్రెసు నిలదొక్కుకోవడం కష్టమే అయింది.

శ్రీయుతులు అతుల్యఘోష్, యస్కే పాటిల్ పార్లమెంట్‌లో నిందారోపణకు గురిఅయినారు. జయంతి షిప్పింగ్ కంపెనీ వ్యవహారాలు శ్రీ సంజీవరెడ్డిని హెచ్చరించనే హెచ్చరించాయి. పార్లమెంటులో కన్నాపార్టీలో తమ ఆర్థిక సలహాదారులకు పునాదు లేవని శ్రీమతి గాంధి గుర్తించారు. శ్రీ అశోక్ మెహతా పరిస్థితుల్ని అర్థం చేసుకుని మన్ను తిన్న పాములా కూర్చున్నారు. ఇంక మిగిలింది ఎవరయ్యా అంటే ఆర్థిక మంత్రి శ్రీ శచీన్ చౌధురి, ఆహార మంత్రి శ్రీ సుబ్రహ్మణ్యమూను. వీరిద్దరి రాజీనామాల కోసం ఎంతో ఆందోళన సాగింది. దీనికి కారణం కొందరికి హోదా తగ్గించిన కారణమని తెలుస్తూనేవుంది.

కొందరు కుతంత్ర కాంగ్రెసు వాదుల సహాయంతో ఇంతవరకు ప్రతి పక్షం ఏమి చేయగల్గింది? ప్రభుత్వ సేవలని త్రాణీకరించ గల్గింది. పార్లమెంటు రాజ్యాంగాన్ని కూలద్రోయడం ఎలాగా అని ప్రయత్నించింది. ఇప్పటికైనా పార్లమెంటును కుంటినడక నడిపించే ఒక డజను మంది అందులోంచి తప్పుకోవడం అవసరమని కొందరు గుర్తించ గల్గితే అదేచాలు.

ప్రభుత్వాన్ని సవరించడానికి కొందరు పూనుకున్నారు. రాజ్య సభలో, సర్దార్ వల్లభాయి పటేల్ కుమారుడు శ్రీ దయాభాయ్ పటేల్, అశోక్ మెహతాగారి

మరో 'తోడు', శ్రీ చంద్రశేఖర్‌గారు ఈ దండయాత్రకు సన్నద్ధులైన వారు. లోక్ సభలో శ్రీ మధులిమాయె ప్రమాద

# మా ఢిల్లీ లేఖ

కరమైన వ్యక్తి. శ్రీ దయాభాయ్‌పటేల్ స్వతంత్రపార్టీలోని వారు. శ్రీ మధు లిమాయె సంయుక్త సోషలిస్టు పార్టీకి చెందినవాడు. శ్రీ చంద్రశేఖర్ అశోక్ మెహతాను దారి తప్పించిన సోషలిస్టు. దీనిని బట్టి కాంగ్రెసు ప్రభుత్వాన్ని విమర్శించే సోషలిస్టు పార్టీయొక్కగాని, స్వతంత్రపార్టీ యొక్కగాని ఆంతరంగిక తత్వం అర్థమై పోతూనే వున్నది.

పూర్వం పండిట్ మోతీలాల్ నెహ్రూ బ్రిటిష్ ప్రభుత్వాన్ని నేల మట్టం చేయుటానికి స్వరాజ్య పార్టీని స్థాపించి లెజిస్లేచర్‌లో కాలు పెట్టారు. ఇప్పుడు శ్రీ చంద్రశేఖర్ గారు కాంగ్రెస్‌లో అడుగెట్టారా అంటే దీని భావమేమి తిరుమలేశ?

ఒక కాంగ్రెసు నాయకుణ్ణి నలుగురు నవ్వేట్టుగా పదవిచ్యుతుణ్ణి చేశారా అంటే, లేదా అతని హోదాని తగ్గించారా అంటే చాలా అవమానకరమైన విషయం. అతని సహోద్యోగులు తోటి వాని పదవిని తగ్గించినప్పుడు వారేమీ పట్టించుకోలేదా అంటే వారు లోలోన ఆనందిస్తున్నారనే కదా భావం!

ఇప్పటి దుస్తరమైన పరిస్థితి ఏమిటి అంటే పరిపాలనకు సంబంధించిన ఆంతరంగికమైన, ముఖ్యమైన సమాచారం — దానికి సంబంధించిన కాగితాలు పరహస్తగతాలవడం. రహస్యమైన కాగితాలు పరుల చేతుల్లో చిక్కడం దేశీయాంగ శాఖ అశక్తికి నిదర్శనంగా కనబడుతూ వుంది. రహస్య సమాచారాన్ని సేకరించిన ప్రతి పక్షంవారు రాళ్ళు రువ్వుతున్నారు. పత్రికలు దుమ్మెత్తి పోస్తున్నాయి. అవినీతికి పాల్పడ్డ అధికారులను శిక్షిస్తూ 'విజిలెన్స్ కమీషన్,' తన బాధ్యతకు నిదర్శనంగా కొన్ని రిపోర్టులను ప్రచురిస్తూ వున్నది. ఆ రిపోర్టుల్లో వున్నవారు అధికంగా ఎవరూ అంటే, రెండు మూడు రూపాయిలు చేజిక్కించుకున్న చిన్న జీతాల అభాగ్యులు మాత్రమే. ఈ దేశీయాంగశాఖ, సర్వాన్నీ ధారపోసి ఇల్లూ వాకిలీ మరచి ఆఫీసుపనికే అంకితమైపోయే పనివాళ్ళకు రక్షణ కల్పించగలుగుతుందన్న మాట వట్టి మాట. పోనీ రాష్ట్ర పరిపాలనలోను, తదితర వ్యవహారాలలోను రహస్యాలు బట్టబయలవుతున్నాయిగదా దానికేమైన చర్యతీసుకుని అందుకు బాధ్యులైన వారిని దండిస్తూ వున్నదా అంటే అదీ లేదు. ఈ సమస్యలన్నీ పరిష్కరింపబడే మంచి రోజు ఎప్పుడొస్తుందో దాని కోసం ఎదురు చూద్దాం! ●



# బరితెగించిన ఆడది

యర్రంశెట్టి శాయి

“హుఁ! తనసంగతి తెలీదు. కోపం వస్తే ఏం చేస్తాడో అసలు తనకే తెలీదు. ఏం చేసినా చేస్తాడు. ఆ! తను మరీ మెత్తగా వుంటున్నాడని అందరికీ అలుసయిపోయింది. తన మెత్తదనం మూలానే చిన్నప్పట్నుంచీ ఇప్పటివరకూ అందరూ తన మీద స్వారీ చేసేశారు. చిన్నప్పుడు అమ్మమ్మ తన మెత్తదనం చూసే తనకి ఇష్టం లేకపోయినా రోజూ పెరుగన్నం తినిపించేది. ఈ మెత్తదనం చూస్తే, నాన్న తనని బి. ఏ. చదువుతా నంటే వద్దని బి. కాం.లో చేర్పించేశాడు. మళ్ళీ ఈ మెత్తదనం మూలానే అమ్మ తనకి అప్పుడే పెళ్ళి వద్దు అని గోలెడుతున్నా వినిపించుకోకుండా బాంకులో ఉద్యోగం దొరికీ దొరగ్గానే ఓ పిల్లను చూసి పెళ్ళి చేసి పారేసింది. పోనీ అక్కడితో గొడవ వదిలి పోయిందనుకొంటే తన మెత్తదనం సంగతి అమ్మ ద్వారా కూపీ లాగేసి నిన్నగాక మొన్న వచ్చిన పెళ్ళాంగారు కూడా తనని ఆటలు పట్టించేస్తోంది. లాభంలేదు.. ఏమాత్రం వీల్లేదు. ఇవాళ్టి నుంచీ తనో కర్కోటకుడుగా, రాతి హృదయం గలవాడిగా, అతి దుర్మార్గుడిగా, తెలుగు సినిమాలో ఇంటర్వెల్ తరువాతి విలన్‌లా, తన హెడ్ ఎకౌంటెంట్‌లా, మారిపోవాలి.. హు! లేకపోతే అంత అలుసేం? మొగుడంటే అంత చవకేం? కట్నం లేకుండా పెళ్ళాడాడు గాబట్టి ఆవిడగారికి మొగుడి వాల్యూ ఏం తెలియడంలేదు.. ఎంతమంది కట్నాలు ఇచ్చీ, మంచి మొగుళ్ళు దొరక్క చచ్చి పోతున్నారు! అంతవరకెందుకూ? ప్రక్క వీధిలో విమలమ్మగారి అమ్మాయికి పదివేల కట్నమిచ్చి పెళ్ళి చేస్తే ఆ మొగుడు పెళ్ళయిన రెండోరోజునే కోర్టులో విడాకులకి దావా వేశాడు. తన హెడ్ ఎకౌంటెంట్ గారి అమ్మాయి మొగుడు పెళ్ళయిన అయిదో రోజునే త్రాగొచ్చి మామగారితో సహా అందర్నీ చావగొట్టి, బయటుగ్గొంటి తలుపు గొళ్ళెం పెట్టేశాడు.

వసారాలో తాళంవేసి వున్న తలుపు వంక వుండుండి గుడ్లురిమి చూస్తూ, పళ్ళు పటపటమని (శబ్దంరాపోయినా) కొరుకుతూ, పై డైలాగులన్నీ అనుకొన్నాడు గిరి. కాసేపటూ ఇటూ తిరిగి తాళం కప్ప వంక మరోసారి చూసి మళ్ళీ అందుకున్నాడు.

“అవును మొగోడు అన్న తరువాత సవా లక్ష పన్లుంటాయి. ఉంటాయేమిటి వున్నాయి. అంచేత ఒకోసారి వేసుకున్న సినిమా ప్రోగ్రాం మిస్ అవ్వచ్చుగాక, అలా అన్జెప్పి టపీమని ఇల్లు తాళం పెట్టేసి పక్కింటివాళ్ళతో సినిమాకి చెక్కెయ్యడమే? మొగుడుగాడు ఆఫీసుతో చచ్చి చెడీ సాయంత్రం వరకూ పన్జేసి ఇంటి కొస్తే మొహం పగలగొట్టినట్టు ఇంటికి తాళమా?... ఎదురుగా కనబడితే బుగ్గలు పిండేసేను మరి.. తన సంగతిపూర్తిగా తెలీదు..అయినా అనుకోవాల్సిన పనేముంది? కాలం అలాంటిది. మరీ బరితెగించిపోయారు ఆడాళ్ళు.” కసిదీరా తిట్టుకొంటున్నాడు గిరి.

ఇంతలోనే ఎదురింట్లో పనిచేసే సాంబులు కుర్రాడు రాకెట్‌లా దూసుకొచ్చి “సార్! మన భార్యగారు.. ప్రక్కింటి భార్య గారితో సిన్మాకి పోయార్. ఈ తాళం చెవీ మీకూ ఇమ్మన్నార్..” అని తాళంచెవ్వి మీదకి విసిరేసి మళ్ళీ రాకెట్‌లా దూసుకు వెళ్ళిపోయాడు.

“వ్వాట్! వటేమ్ వెధవామ్! షాక్!,

తెలుగు నేర్చుకోరా! మన భార్యగారేమి గ్రా దాస్కేల్!'' మండిపడిపోయాడు గిరి..

ఇదొకటి కోపం ప్లస్ ఈ మంట కలిసి తగలబడిపోవాల్సిన పని.. కాని తగలడలేదు.

"హూ!హూ!'' అని రెండుసార్లనుకొని తలుపు తాళం తీసి లోపలకు వెళ్ళాడు. లోపల బల్లమీద చీటీ రెపరెప కొట్టుకొంది. విప్పి చూశాడు గిరి.

"శ్రీవారికి,

మీకోసం ఆరున్నర వరకూ ఎదురు చూశాను. "పతియే ప్రత్యక్షదైవం'', సినీమా ఇవాళ ఆఖరిరోజు. అంచేత ప్రక్కింటి పిన్నిగారితో వెళ్తున్నాను. ఫ్లాస్కులో కాఫీ వున్నాయి. అన్నం కూరలు వండే వుంచాను.. ఆకలి వేస్తే భోంచేయండి..

మీసతి అనసూయ.''

ఆ చీటీని ఓ లక్షముక్కలు చేసి బయట పారేశాడు గిరి.

"హూ! అయినా ఈ ఆడాళ్ళనని ఏం లాభం! ఈ బుద్ధిలేని మొగాళ్ళననాలి. లేకపోతే అంత అలుసివ్వడమేమిటి వీళ్ళకి?.. ప్రక్కింటి బాబాయి మరీ చచ్చు బాబాయి. పెళ్ళయిం దగ్గర్నుంచి తనే వంట చేసి పెడ్తున్నాడు పిన్నికి.. ఎదురింటి సుబ్బిగాడూ అంతే! ఈమధ్య నెలరోజుల్నుంచీ సెలవు పెట్టి మరీ వంట చేస్తున్నాడు.

"ఇదేమి జబ్బురా నీకు'' అని తను ఫ్రెండ్సందరూ మొన్న నిలేస్తే "మాఆవిడకి వంట్లో బావుండ లేదంటూ'' బొంకేశాడు. సాయంత్రమయేసరికి టింగురంగామంటూ సినిమాకి బయల్దేరే వాళ్ళావిడకి ఏం జబ్బో తన కర్థం కాలేదు. తనకనేమిటి? ఓ వందమంది సైంటిస్టులని ఓ కమిటీగా వేసి పరిశోధించమంటే వాళ్ళకీ అర్థం కాదు! గ్యారంటీ ఇచ్చాడు తను. అమ్మాడో ఇదివర్లో క్రొత్తగా పెళ్ళయిన జంట వుందా అంటే వాళ్ళిద్దరిలో మొగుడెవరో పెళ్ళాం ఎవరో తన కింతవరకూ తెలియనివ్వలేదు వాళ్ళు. అలాంటి లంట్లవెధవయిపోయాడు వాడు. ఇలాంటి వాళ్ళందరి మధ్య వుంటే తన పెళ్ళాం మాత్రం, పాడయిపోయిందంటే... పాడవదూ 'మరి! తనను దుమ్మంటూ వాళ్ళందరితో జమ కట్టేసింది! కాని తనకి కోపం వస్తే ఏదో ఒకటి చేసేస్తాడన్న సంగతి ఇంకా తెలీదు. సామానంతా సర్దేసి, ఆ పెట్టెనీ, తననీ రైలెక్కించి, పుట్టింటికి పంపించేస్తాడన్న సంగతి గ్రహించుకోలేదింకా! అవునులే! దానికయినా అనుభవమేముంది పాపం ఈ దెబ్బతో తెలిసి వస్తుంది. ఎంత బతిమాలినా వస్తే తగ్గడు తను. ఇక్కడికే చాలా బోలెడు అలుసిచ్చేశాడుతను. తాతయ్య చెబుతవుండేవాడు వాళ్ళ కాలంలో ఆడవాళ్ళు పిల్లులంట! వంట ఆడవాళ్ళే చేసేవాళ్ళట! మగాళ్ళ బట్టలన్నీ ఆడాళ్ళే ఉతికేవాళ్ళట! మొగుడు పళ్ళు కాలి చస్తున్నాసరే ఎదురుబడి మాట్లాడ్డానికి సిగ్గుపడేవాళ్ళట! మొగుడు "హాయ్'' అని కోపంతో ఒక్క కేకవేస్తే సంక్రాంతి చలిమంటల వరకూ వణుకుతూ కూర్చునే వాళ్ళంట! అప్పటికయినా నవ్వుతూ మాట్లాడితేనే వణుకు తగ్గేదిట. లేపోతే ఆనెక్స్టు సంక్రాంతి వరకూ కంటిన్యూ అయేదిట! మొగుడికి కాస్తంత, వంట్లో నలతగా వుంటే.. దేముని గదిలో విగ్రహాల ముందు పూజలు చేసిచేసి శోష వచ్చిపడిపోయే వాళ్ళట.. అసలు మళ్ళీ ఆ మొగుడే జ్వరం తగ్గిపోయి లేచివచ్చి పెళ్ళాం మొఖం మీద చన్నీళ్ళు కొట్టేవరకూ లేచే వాళ్ళు కాదుట!

హబ్బో! అప్పటికీ ఇప్పటికీ అసలు పోలికేమయినా వుందా? ఈ ఆడాళ్ళు బరితెగించారని తను అనుకొన్నాడంటే అనుకోడూ మరి? ఫ్లాస్కులోని కాఫీ గ్లాసులోనికి వంచుకొని తాగాడు గిరి. చాలా అద్భుతంగా వున్నట్లనిపించింది కాఫీ.

అయినా తమాయించుకొన్నాడు గిరి.

"ఛీ! కాఫీ దాని మొఖంలా వుంది! ఏం బావుండి చావలేదు!'' అని విసుక్కొన్నాడు. భోజనం చెయ్యాలిట ఆకలి వేస్తే, లేపోతే చెయ్యొద్దనేగా అర్థం. ఏమయినా సరే భోజనం చేయగూడదని నిర్ణయించుకొన్నాడు గిరి. అంత గతి లేదనుకొందేమో.

మరో గంట గడచిపోయింది.

చాలా ఆకలి వేసినట్లనిపించింది గిరికి. "అయినాసరే, అన్నం తినను'' అనుకొన్నాడు గిరి. అటూ ఇటూ పచార్లు చేయసాగాడు. టైము తొమ్మిదవుతోంది. ఇల్లంతా చీకటిగా వుంది స్విచ్ నొక్కాడు గిరి.

"ఏం కూర వండిందో భోజనంలోకి!'' ఆలోచన వచ్చింది గిరికి. కాసేపాగి 'ఏదయితే తనకేం?'' అనుకొన్నాడు. మరికొద్ది నిముషాలు గడచినయి.

"అవును.. ఏం వండిందో చూస్తే ఏం పోయింది? తనెలాగూ తినబోవడంలేదు కదా! అని సమర్థించుకొని వంటింట్లోకి నడిచాడు.

ఉల్లిపాయలతో దోరగా వేగించిన బంగాళాదుంపల కూర! ఒక్కసారిగా నోట్లో గిన్నెడు నీళ్ళూరినయి గిరికి. మరో గిన్నెలో కమ్మని పప్పుచారు. గ్లాసులో గడ్డపెరుగు. తను పడి చచ్చేవంటకాలన్నమాట?

ఇలా అయితే లొంగిపోతానని దాని వుద్దేశ్యం! "చస్తే భోజనం చేయను! ఏమను కొందో'' అనుకొన్నాడు గిరి.

తిరిగి పచార్లు మొదలెట్టాడు.. కడుపులో ఎలుకలు రేసుకోర్సులో పరిగెత్తినట్లు తిరుగుతున్నాయి.

"భోజనం చేస్తే ఎలా వుంటుంది?'' ఆలోచించాడు గిరి. తనయితే ఏమీ తగ్గిపోడంలేదు. కోపం అలాగే వుంచుకొంటేసరి. అయినా భోజనానికి సంబంధమేముంది?

"ఏమీ లేదు! మహారాజులా భోంచేయవచ్చు!'' అనుకొన్నాడు గిరి. వెంటనే వంటింట్లోకి నడిచి పీట వాల్చుకుని వడ్డించుకొన్నాడు. పదార్థాలు చాలా బావున్నట్లున్నాయి. "అయితే మాత్రమేం!'' అనుకొన్నాడు మళ్ళీ. భోజనం ముగించి చెయ్యి కడుక్కొని లేచాడు. నిద్ర బ్రహ్మాండంగా వస్తోంది.

"ఏమయినాసరే, నిద్రపోగూడదు. నిద్రపోతే కోపం సంగతి మరచిపోవచ్చు'' కుర్చీలో కూర్చుని ఆవేళ పేపరు చదువసాగాడు.

తొమ్మిదీ ముప్పావు అయిపోయింది. సినిమాల నుంచి జనం తిరిగి వచ్చేస్తున్నారు. అనసూయ వచ్చేస్తుందిక! అయినా పరవాలేదు. తను కోపంగానే వున్నాడు. అనుకొని శాంతపడ్డాడు గిరి. కొద్దిగా ఆశ్చర్యం కూడా కలిగిందతనికి. "తనెప్పుడూ ఇంత కోపంగా వుండలేదు!'' దూరంగా ప్రక్కింటి పిన్నిగారి గొంతు. వచ్చేస్తోంది అనసూయ. అయితే కోపం ఎక్కడా అంతు కనిపించలేదతనికి. పళ్ళు పటపట లాడించేడు. మొఖం చిట్లించేడు. కళ్ళు నులుముకొన్నాడు ఎర్రబడతవేమోనని! జుట్టు కొద్దిగా చిందరవందర చేశాడు. చొక్కాచేతులు పైకి మడిచాడు.

"ఈసారికి పోనియ్యరాదు టోయ్!'' అంతరాత్మ సజెషను.

"నువ్వాగబోకు. మధ్యలో వచ్చావంటే డొక్కచించేస్తాను'' కోప్పడ్డాడు గిరి.

"ఎంత కోపమయితే మాత్రం మరీ అంత

పిచ్చికోప మేమిటి లెస్సూ!'' పొగిడిసింది అంతరాత్మ.

ఈ అంతరాత్మేదో సినిమాలోలా ఎదుటకి వస్తే పీక పిసికేద్దామన్నంత కోపం వచ్చింది గిరికి.

దీని దుంపతెగా! మనకి బయటికి ఒక్క అంతరాత్మా కనబడి చావదుగాని తెలుగు సినిమాల్లో ఒహోసారి డజన్ల కొద్దీ కనబడుతుంటయి. గోడలెక్కి, కిటికీ లెక్కి మరీ నుంచుంటయి.

అనసూయ వచ్చేసింది.

గిరి సీరియస్ అయిపోయేడు.

"ఏమండీ! ఇంకా నిద్రపోలేదూ? భోజనం చేశారా?.. అబ్బ సినిమా ఎంత బావుందని? నిజంగా మీరు రావలసిందండీ!. మధ్యలో ఎంచేతో తలనొప్పి..అలాగే కూర్చుని సినిమా అయింతరువాత వచ్చాను.''

నవ్వుకొన్నాడు గిరి. తను కోపంగా వున్న సంగతింకా గ్రహించలేదు పిచ్చిపిల్ల అనుకొన్నాడు. ఆమె అమాయకత్వం చూస్తే జాలి కలిగింది.

"ఒక్క నిముషం! భోజనం చేసివస్తాను!' అంది అనసూయ లోనికి నడుస్తూ. వెళ్తూంటే ఆమె వంకే చూశాడు గిరి.





తన కిష్టమయిన గులాబిరంగుచీరా, అదే రంగు జాకెట్టూ మల్లెపూలూ..

"అనసూయ చాలా బావుంటుంది'' అనుకొన్నాడు గిరి. వుంటుందేమిటి వుంది. అందుకే గదా కట్నం లేకుండా పెళ్లాడేడు తను.

మరు నిమషంలోనే బయటికి తిరిగి వచ్చిందామె.

"పదండి. ఇప్పటికే బోలెడు ఆలశ్యమయింది. నిద్ర ముంచుకు వస్తోంది' పడగ్గది లోకి నడిచిందామె.

"ఇప్పుడే తను కోప్పడాలి'' ఆమె వెనుకే లోనికి వెళ్తూ అనుకొన్నాడు గిరి. అనసూయ అతని గుండెలకి ఆనుకొంటూ అడిగింది "నా మీద చాలా కోపం వచ్చింది గదూ?''

"హరి!...కనుక్కుందన్నమాట!'' అనుకొన్నాడతను.

"వంటింట్లోంచి అప్పుడే వచ్చేవేం? భోంచేయలా?''

"లేదండీ! నే వెళ్లేప్పటికి కుక్క ఒకటి అన్నం తినేస్తోంది. మీరు దొడ్డితలుపు వెయ్యడం మఱచిపోయారు!''

"మరి నీ భోజనం?''

"దాన్దేముందండీ. ఒక్కపూట లేపోతే చచ్చిపోతానా?''

"అరె పాపం! నేనెంత వెధవ పనిజేసేను!'' అనుకొన్నాడు గిరి.

"అట్లాయితే మరిప్పుడెలా?''

"మరేం ఫర్వాలేదు లెండి! ఒక్కపూట కేగా! పైగా నాకు తలనొప్పిగాకూడావుంది.'' నవ్వింది అనసూయ.

నవ్వినప్పుడు ఆమె బుగ్గలు సొట్టపడి చాలా అందంగా కనిపించింది గిరికి. ఆమె మొఖాన్ని రెండుచేతులతోనూ పట్టుకొని "నువ్వివాళ చాలా అందంగా వున్నావు'' అన్నాడు.

"ఎందుకనో?'' అంది అనసూయ.

"నాకేం తెలుసు.. అదిసరే..నీ మీద నాకు బోలెడు కోపం వచ్చింది!''

"ఎందుకలా పాపం!'' అంది నవ్వుతూ,

"ఎందుకేమిటి.. ఇల్లు తాళంబెట్టి.. వెళ్లిపోతే.. పైగా ఒక్కడినీ ఒంటరిగా..''

"మీ కోసం చూసి చూసి వెళ్లాను. సినిమాలో కూడా మీగురించే ఆలోచన.. భోంచేశారో లేదో! కాఫీ త్రాగారో లేదో..''

ఐసుకన్నా కొన్నివందల డిగ్రీలు చల్లగా అయిపోయాడు గిరి.

"ఎందుకు వెళ్లానా అనిపించింది వచ్చేస్తుంటే!''

"ఆవెళ్తే మాత్రమేముంది లెస్సూ!''

"మీరెన్నన్నా చెప్పండి.. ఇకనుంచి అలా వెళ్లకూడదనుకొన్నాను!''

"ఛఛ! అదేమిటి! ఒక్కోసారినా కాలక్షేపం అవ్వచ్చు. అలా అని నువ్వు మనం వేసుకొన్న ప్రోగ్రాం మానుక్కోవాలేమిటి? మరీ రాముల వారి కాలంలో అమ్మాయిలా మాట్లాడకు!.. ఆమాట కొస్తే అసలు ఆడాళ్లు ఇంకా చాలా ఎడ్వాన్స్ కావాలంటాను'' అన్నాడు గిరి.

"మీరెంత మంచి వాళ్లండీ!'' నవ్వింది అనసూయ.

"ఇంతకూ నీ భోజనం..''

"ఉరుకోండురూ! ఒక్కపూట భాగ్యానికి గొడవ..''

"ఉహూ! అలాక్కాదు. టిఫిన్ కారియర్ తీసుకురా! హొటల్నుంచి తీసుకొస్తాను!''

"అబ్బ! ఇప్పుడెందుకండీ!''

"నీకు తెలియదు.. అసలే తలనొప్పంటున్నావు.. ఆకలి మీద మరీ ఎక్కువవుతుంది. రేపు గూడా బాగా రెస్టు తీసుకో.. ఆఫీసుకి వారంరోజులు సెలవు పెడతాను..కాస్త వంటలో, అదీ, నీకు సాయంగా..'' సైకిలు బయటికి నడిపించాడు గిరి.

"వద్దంటే వినరు కదా!'' టిఫిన్‌కారియర్ అందించిందామె.

కారియర్ అందుకుని సైకిలుమీద రివ్వున బయలుదేరాడు గిరి.

"పాపం! అనసూయ చాలా మంచిది'' అనుకొన్నాడు. చలిగాలి విసురుతోంది.

"ఇంకా నయం! తను ముందూ వెనుకా చూడకుండా కోప్పడేశావాడే కొద్దిగా వుంటే! ఇంకెప్పుడూ అసలు చస్తే అనసూయ మీద కోపం తెచ్చుకోకూడదు'' సైకిలు మరింత వేగం అందుకొంది. ●

సీరియల్ :




### జరిగిన కథ

మంజుల ప్రోద్బలంతో పేదవారికి వైద్యం చేయటానికి ఒప్పుకుంటాడు హరీష్. ఆస్తికోసం మంజులను ప్రేమిస్తున్నట్లు నటించిన శంకరం అసలురూపు బయటపడుతుంది. హరీష్‌నుంచి తానాశించిన సమాధానంరాని మంజుల హతాశురాలవుతుంది. అనాథయైన సుదర్శనం తన కథనంతా హరీష్‌కి చెప్తాడు. హరీష్ తల్లి సుదర్శనాన్ని గుర్తించి వాస్తవాన్ని హరీష్‌కి తెలియజెప్పి తన యింటికి తీసుకొస్తుంది. శాంత తన విషాదగాథను వివరిస్తుంది. ఇల్లు విడిచిపెట్టి వెళ్ళిపోతున్న శాంతను శర్మ ఆదరిస్తారు.

## 11

సీతాపతిగారి భార్య శారదాంబగారి పేరు మీద స్థాపించిన శరణాలయంలో కళ్ళు తెరిచిన మొదటి శిశువు హరీష్.

అనతికాలంలోనే ఆ శరణాలయం మంచి పేరు ప్రఖ్యాతులు గడించుకుంది. ఎంతో మంది స్త్రీలు, వృద్ధులు, పసివాళ్ళు, వికలాంగులు అందులో ఆశ్రయం పొందుతున్నారు. అక్కడికి వచ్చిన స్త్రీలు తమ తమ జీవితాల్నిగురించి చెప్తుంటే, ఒంటరిగా ఆడది ఈ ప్రపంచంలో బ్రతకటం ఎంత కష్టసాధ్యమో గ్రహించుకున్న పద్మావతి, ఆనాడు అదృష్టవశాత్తు సీతాపతిగారే తనకి కనిపించక పోతే, గూడువిడిచిన పక్షిలా తన జీవితం ఏమై పోయేదో తలుచుకుంటేనే ఆమె వళ్ళు జలదరిస్తుంది.

సీతాపతిగారి అండని ఏలాంటి ఒడిదుడుకులు లేకుండా ప్రశాంతంగా ఆమె జీవితం సాగిపోతోంది. అయినా అప్పుడప్పుడు గతం గుర్తుకు వచ్చి ఈ అతి ప్రశాంతతలో ఏదో అపశ్రుతివుందేమోనని ఆమె హృదయంలో ఏమూలో కలుక్కు మంటూండేది. హరీష్ కొంచెం పెరిగి, "అమ్మా, నాన్నగారెక్కడికి వెళ్ళారు— ఎప్పుడువస్తారు— నాకు బొమ్మలు తెస్తారా — నన్ను ఎత్తుకుంటారా?" అంటూ అమాయకంగా తనను ప్రశ్నలు వేస్తుంటే, వాడికి ఏమని సమాధానం చెప్పాలో తెలియక, "భగవంతుడా, నేను చేసినది పొరబాటా, మా యిద్దరి మధ్య అర్థంలేని పట్టుదలలు పంతాలు పెంచుకుని, చివరికి ఈ పసివాడికి తీరని ద్రోహంచేస్తున్నానా?" అనుకుని ఆ గుండెలు పిండే బాధతో కుమిలిపోయేది. ఆమె మనస్థితి గ్రహించుకున్న సీతాపతిగారు,

"నేను దగ్గరుండి నిన్ను తీసుకువెళ్ళి నీ భర్తకి అప్పగిస్తానమ్మా— ఇన్నాళ్ళ తరువాత అతనిలో యింకా అప్పటి అహంకారం పట్టుదలవున్నాయని నేను అనుకోను. నీలాగే అతనూ పశ్చాత్తాప పడుతూండవచ్చు— ఒకవేళ అంతగా అతను కాదూ అంటే అప్పుడే నాతో వచ్చేద్దువుగాని." అని నచ్చ చెప్పటానికి ప్రయత్నించేవారు.

"మీకు తెలియదు బాబయ్యగారు. అజ్ఞానంచేతో, ఆవేశంతోనో, మొండి ధైర్యంతోనో యిల్లు విడిచి వచ్చేసిన స్త్రీకి మళ్ళీ ఆ గడపతొక్కే అర్హత వుండదు. నా సంగతి కూడ అంతే— ఆనాడు వారు అన్న మాటలకి అర్థం వున్నా లేకపోయినా, తరువాత నేను యిల్లు విడిచి వచ్చేసిన సంగతి తెలుసుకుని నన్ను ఎంతో నీచంగా చిత్రించుకుని వుంటారు. నామీద అసహ్యం, కోపం పెరుగుతాయే కాని పశ్చాత్తాప పడే అవసరం రాదు. అప్పుడే వారు మరో వివాహం చేసుకున్నారు. ఈపాటికి నన్నుపూర్తిగా మరచిపోయి వుంటారు. నేను వెళ్ళి కంటబడితే గుర్తించినా, ఇంత జరిగాక నన్ను క్షమించి ఆదరించటం కల్ల. అక్కడికి వెళ్ళి అవమానం పొంది తిరిగి వచ్చేకంటే, ఇలా అజ్ఞాతంగానే వుండిపోవడం నయం." అనేది పద్మావతి.

ఇక ఆమెకు ఏమీ చెప్పలేక, గట్టిగా చెప్పి ఆమె మనస్సు నొప్పించలేక మౌనం వహించారు ఆయన. వృద్ధాప్యంలో అనుకోకుండా లభించిన మనవడి ఆటపాటలతో ముద్దు మాటలతో ఆయన జీవితం చాల సంతోషంగా గడిచిపోతోంది. ఆ మనవడు పెరిగి పెద్దవాడై డాక్టరు కావాలని, శరణాలయంలోని వారికి వుచితంగా వైద్యం చేస్తూ, అన్నివిధాల దాన్ని అభివృద్ధిలోకి తీసుకువచ్చి తన పేరు చిరస్థాయిగా నిలపాలని ఎన్నో కలలు కంటూ వుండేవారు. ఆ కలలు నిజమయే రోజు కోసం ఎదురుచూస్తూ, ఆ రోజు రాకముందే ఆయన కన్నుమూశారు. అప్పటికి హరీష్‌కి పన్నెండు సంవత్సరాలు. తాతగారి కోర్కె మేరకు అతను డాక్టరయాడు, పేదవారలకి తన చేతనైన సహాయం చేస్తూనే వున్నాడు.

యువకుడుగా రూపొంది, పుష్కలంగా డబ్బు, ఖ్యాతి కూడ గడిస్తున్న కొడుకుని చూసి గర్వంతో పాటు భయం కూడ కలుగుతూండేది పద్మావతికి.

వేలకివేలు కట్నాలు ఇస్తామంటూ, ఆడపిల్లల తండ్రులు వలలు వేసి గాలించే పెళ్ళి కొడుకులకి వుండవలసిన లక్షణాలన్నీ తన కొడుక్కి వున్నాయి. ఆ మంచి లక్షణాలన్నింటినీ ఒక్కమాటలో కొట్టి పారవేయగల పెద్ద అవలక్షణం కూడ వుంది. అది బైటపడే రోజు త్వరలోనే రాబోతోంది.

భగవంతుడా, ఈ సమస్యని ఎలా ఎదుర్కోటం? అడిగిన వాళ్ళకి ఏమని జవాబు చెప్పటం?...." అహోరాత్రాలు అదే ఆలోచన, అదే భయం.

కాని, భగవంతుడు కరుణామయుడు. ఈ పాతిక సంవత్సరాలలోనూ కొన్ని లక్షల సార్లు దేన్ని గురించి అయితే ఆలోచించి, అది అసంభవమనీ, ఒకవేళ పిల్లవాడి కోసం తను సర్వం మరిచి వెళ్ళినా ఎంత భయంకరమైన అవమానకరమైన పరిస్థితులని ఎదుర్కోవాల్సి వుంటుందని వూహించుకుందో, ఆ సన్నివేశం హఠాత్తుగా ఎలాంటి ప్రయత్నం అవసరం లేకుండా సమకూరడమే కాదు, జీవితంలో ఎప్పుడూ మరిచిపోలేని అపురూపమైన మధుర ఘట్టంగా రూపొందింది. ప్రళయ గర్జనచేస్తూ ఆమె జీవితాకాశాన్ని కమ్ముకున్న కారుమేఘాలు దూదిపింజల వలె విడిపోయాయి. నిండు చంద్రుడు పండు వెన్నెల కురిపిస్తూ ఆమె జీవితంలో ఎన్నడూ ఎరుగని హాయిని ఆహ్లాదాన్ని కలిగిస్తున్నాడు.

* * *

వారంరోజులు గడిచిపోయాయి. ఈ వారం రోజులలోను సుదర్శనంగారి ఆరోగ్యంలో వూహించలేని మార్పు వచ్చింది. గత ఆరునెలల నించీ పని చెయ్యని మందులు ఒక్కసారిగా శక్తి తెచ్చుకుని పని చెయ్యటం మొదలు పెట్టాయి. అయితే ఆ క్రెడిట్ అంతాపూర్తిగా మందులదే అనటం న్యాయం కాదు. పద్మావతి, హరీష్ ఇద్దరూ నిండు హృదయంతో చేస్తున్న సేవాసపర్యలు, సరి అయిన పోషణ, మానసికంగా విశ్రాంతి వీటన్నింటికి మించి బ్రతుకు మీద ఆయనకి కలిగిన ఆశ ఇవన్నీ ఆయన్ని ఏ డాక్టరూ వూహించలేనంత త్వరగా కోలుకునేలా చేశాయి. ఇప్పుడు ఆయన మనిషి సహాయంతో కాస్త దూరం నడవగలుగుతున్నారు.

ఉదయం లేస్తూనే భర్తకి మొహం కడిగించి, కాఫీ యిచ్చి, ఆయన పనులన్నీ అయిన తరువాతనే వేరే పనిలోకి వెడుతుంది పద్మావతి. స్నానం అయి బట్టలు వేసుకుని ముస్తాబు పూర్తికాగానే వరండాలోకి తీసుకువెళ్ళి కూర్చోపెట్టమంటారు సుదర్శనంగారు. ప్రొద్దున్నే అటువేపు ఎండ వస్తుంది, గదిలోనే విశ్రాంతి తీసుకోమంటుంది ఆవిడ.

"ఇన్నాళ్ళు మంచంలోనే పడి వున్నాను. ఇప్పుడు కూడ రోజంతా గదిలో వుండాలంటే ఎంత విసుగ్గా వుంటుందో నీకేం



తెలుస్తుంది. వీధి వరండాలో అయితే నలుగురు మనుషులయినా కనిపిస్తారు.'' అంటా రాయన.

అసలు సంగతి ఆయనకు తోచకపోవటమూ కాదు, మనిషి మొహం కోసం మొహం వాచిపోవటమూ కాదు. ఫుల్‌సూటులో నీటుగా ముస్తాబయిన కొడుకు, విలాసంగా చేతిలో స్టెతస్కోప్ వూపుకుంటూ, దర్జాగా వెళ్లి వరండా ముందున్న కారులో కూర్చుని డ్రైవ్ చేసుకుంటూ వెళ్లిపోతూంటే తను వరండాలో కూర్చుని చేయి వూపటం ఆయనకి అత్యంత ఆనందదాయకమైన విషయం. అది పైకి చెప్పటానికి మొహమ్మాటపడి ఏవో వంకలు పెడతారు. వాటన్నింటికి ఆ తల్లీకొడుకులు ఏవో సమాధానాలు చెప్పేసి ఆయునని మభ్యపెట్టాలని చూసినా, పసిపిల్లవాడిలా మారాం చేసి ఆవేళ్టికి ఎవరి సహాయంతోనో వెళ్లి అవరండాలో ఓకుర్చీ న్యాకమిస్తారు. అయన ముచ్చట కాదనటం ఇష్టంలేక, వరండాలోకి ఎండ రాకుండా చల్లగా వుండటానికి అటుప్రక్క 'వట్టివేళ్ల తడికెలు కట్టించాడు హరీష్.

ఆ రోజు మామూలుగానే స్నానం ఒడి అయిపోయాక ఆయునని తీసుకొచ్చి అక్కడ కూర్చోపెట్టి వెళ్లింది పద్మావతి. కొడుకు రాకకోసం ఎదురు చూస్తూ, ఇంకా రాడేమిటూ అని లోపలికి ఒకోసారి తొంగిచూస్తూ ఎదురుగా మెట్ల దగ్గర ఆపి వున్న నిగనిగలాడుతున్న కారు వంక తృప్తిగా చూస్తూ కూర్చున్నారాయన. అలా చూస్తూండగానే ఆయన మొహంలోని చిరునవ్వు హాయుమై చికాగ్గా కనుబొమ్మలు ముడుచుకున్నాయి.

''చంద్రయ్యా.'' లోపలికి చూస్తూ ఒక్కకేక పెట్టారు.

''వస్తున్నా బాబూ'' అంటూ, ఆమాట పూర్తయే లోపలే మనిషి వచ్చాడు.

''నీకు కళ్లు సరిగ్గా కనిపించటంలేదా? కారు నిండా ఆమరకలేమిటి? అలాగేనా తుడవటం?'' మరిచిపోయిన ఆఫీసరు అధికారం దర్పం ఒక్కసారిగా ఒళ్లు విరుచుకుని తలఎత్తాయి.

''కారు నేను తుడవలేదు బాబూ, డ్రైవరే తుడిచాడు'' అన్నాడు వాడు నెమ్మదిగా.

''పిల్చుకురా వాడ్ని. అబ్బాయి వచ్చే లోపునే శుభ్రంగా తుడిచిపెట్టమను.''

వంటింట్లో పని చేసుకుంటున్న పద్మావతి ఆయన కేకలు విని ఏం జరిగిందోనని హడిలిపోయి ఇవతలకి రాబోయి, అంతలోనే కారణం తెలుసుకుని నవ్వుకుంటూ లోపలికి వెళ్లిపోయింది. పరిపూర్ణమైన తృప్తితో ఆనందానుభూతితో ఆమె కళ్లు చెమర్చాయి.

''భగవంతుడా, నీ పరీక్షల కన్నింటికి తట్టుకుని ధైర్యంగా నిలబడగలిగిన నాకు జీవితంలో అన్నీ యిచ్చావు. ఇంక ఆ మిగిలిన ఒక్క కోరిక కూడ తీర్చావంటే, ఏ క్షణంలో నీ పిలుపు వచ్చినా తృప్తిగా సంతోషంగా వచ్చి నీ పాదాల ముందు వాల్తాను.'' అనుకుంది కళ్లు ఒత్తుకుంటూ.

గదిలో అద్దం ముందు నిలబడి ముస్తాబవుతున్న హరీష్‌కి కూడ తండ్రి మాటలు వినిపించాయి. సంతోషంతో ఓ విధమైన గర్వంతో కూడిన చిరునవ్వు అతని పెదవులపై తొణికిసలాడింది. అంతలోనే, ''ఇన్ని సంవత్సరాల నించీ ఇలాంటి అభిమానానికి వాత్సల్యానికి మేమిద్దరం దూరం అయిపోయాం.'' అనే బాధ అతని హృదయంలో ముల్లులా గుచ్చుకుంది.

''ఏదో ఈనాటికైనా ఈ అదృష్టాన్ని అందుకున్నాను. దొరికిన దానితోనే తృప్తిపడాలి.'' అనుకున్నాడు మళ్లీ...

తన కళ్లకి ఎక్కడా లోపం అంటూ కనిపించకుండా, తళ తళ మెరుస్తున్న కారు వంక తెల్లబోయి చూస్తూ, నిలబడి వున్న చంద్రయ్యని—

''ఏమిటి చూస్తున్నావ్ త్వరగా వెళ్లు ఆలశ్యం అయిపోతుంది.'' అంటూ గద్దించారు.

ఇక ఆలోచనలకి స్వస్తిచెప్పి లోపలికి తుర్రుమన్నాడు వాడు.

ఇటుతిరిగి చంద్రయ్యని కేకలేసి, వాడు వెళ్లిన వేపే యింకా చూస్తూ కూర్చున్న సుదర్శనంగారు వరండా మెట్లెక్కి వస్తున్న వ్యక్తుల్ని గమనించలేదు.

''ఇంటికంటె గుడిపదిలం అన్నట్లు ఏకంగా డాక్టరుగారింట్లోనే మకాం పెట్టేశారే! ఆయన మందులు బాగా వంటబట్టినట్లున్నాయ్. బావగారి కేకలు గేటు దాకా వినిపిస్తున్నాయ్'' నవ్వుతూ అన్నమాటలు విని గబుక్కున ప్రక్కకి తిరిగారు. శేషగిరి, అతని ప్రక్కనే చిన్నబోయిన మొహంతో మంజుల తన వేపే వస్తున్నారు.

''వచ్చావా, మంజూ.'' అన్నారు ఆదరంగా. చెయి జాపి మంజులని దగ్గరికి తీసుకుంటూ.

''స్వంత మేనగోడల్ని, నేను మూర్ఖంగా వదిలి వెళ్లిపోయినా, పరాయివాడయిన డాక్టర్ ఆయనకి తన యింట్లో ఆశ్రయం చూపించాడు'' అనే ఆలోచనే ఆమెని సిగ్గుతో తలఎత్తుకో లేకుండా చేస్తోంది.

''అత్తయ్య వుంది కదా అని నేను వెళ్లిపోయాను. ఆవిడా వెళ్లిపోయింది కదూ. రాగానే అక్కడికే వెళ్లాం. ఇల్లు తాళం వేసుంది. నిన్న డాక్టరుగారు తీసుకు వెడుతుంటే చూశామని ప్రక్కవాళ్లు చెప్పారు. నేను చేసిన పనికి నాకెంతో సిగ్గేస్తోంది. నువ్వు అదేం మనస్సులో పెట్టుకోకు.'' అంది తలవంచుకుని ఆయన చేయి నిమురుతూ.



సుదర్శనంగారికి తను వింటున్న దేమిటో అర్థంకాలేదు. "నువ్వు చెప్తున్న దేమిటి? నేను వ్రాసిన ఉత్తరం నీ కందలేదూ?" అన్నారు మంజుల గడ్డం పట్టి తన వైపుకి తిప్పుకుంటూ.

ఈసారి మంజుల తెల్లబోయింది. ఆమె ఏదో చెప్పబోయేంతలో శేషగిరి కల్పించుకున్నాడు. "బాగుంది, ఉత్తరం ఏమిటి? అసలు ఎప్పుడు వ్రాశారు? ఏదో తొందర పడి వచ్చేసిందేకాని, వచ్చిన దగ్గర నుండీ మీ కోసం బెంగపెట్టుకుని మీరెలా వున్నారో నని బాధపడటంతోనే సరిపోయింది. రాక రాక వచ్చావు ఒక నెల్లాళ్లయినా వుండు, నేను వుత్తరం వ్రాసి ఆయన ఆరోగ్యం ఎలాగుందో కనుక్కుంటాను అంటే వింది కాదు. సరే వెంటబెట్టుకు వచ్చాను. కారణం కూడ చెప్పమంటారా? అమ్మాయి మాటల్లో మామయ్య అనారోగ్యాన్ని గురించిన ఆదుర్దా కంటే, డాక్టరుగార్ని గురించిన ప్రశంసా వాక్యాలు..."

".ఛ ఫో, నాన్నా." చిరు కోపం ప్రదర్శిస్తూ చురుగ్గా అటు చూసింది. గుండె ఝల్లుమంది. ఎదురుగా హరీష్ చిలిపిగా తన వేపే చూస్తున్నాడు. మనోహరమైన చిరునవ్వొకటి అతని పెదవులపై మెరుస్తోంది. అతని నవ్వులో చూపులో ఎన్నో అర్థాలు గోచరించాయి మంజులకి. మనస్సు పురివిప్పిన నెమలిలా నాట్యం చేస్తుంటే ఎరుపు రంగుకి తిరిగిన మొహం చటుక్కున వంచేసుకుంది.

శేషగిరి మాటలు వింటూ ముసిముసిగా నవ్వుకుంటున్న సుదర్శనంగారు అది చూసి మంజుల భుజం కుదిపేస్తూ ఫక్కున నవ్వేశారు. శేషగిరి కూడ శృతి కలిపాడు.

సిగ్గుతో మొగ్గ అయిపోయిన మంజుల తల యింకా వంచేసుకుని, వీలయితే అక్కడ నించి పారిపోవాలనుకుంటూంటే, పద్మావతి దగ్గరగా వచ్చి ఆదరంగా రెండుచేతుల తోను ఆమెని చుట్టేసి,

"అంత సిగ్గెందుకమ్మా. బావేకదూ." అంది.

ఆవిడ చెప్తున్నదేమిటో అర్థంకాక తెల్లబోతూ తల పైకెత్తి పద్మావతి కళ్లలోకి చూసింది.

విరగబడి నవ్వుతున్న శేషగిరి హఠాత్తుగా ఆ నవ్వు ఆపేసి నాలికతో పెదవులు తడుపుకుంటూ కళ్ళు అప్పగించి చూశాడు.

"ఏమిటి బావా అలా చూస్తావు? సుష్వరా గ్రహించుకోలేదా ఆమె నా భార్య శాంత. హరీష్ మా అబ్బాయి." అన్నారు సుదర్శనంగారు గర్వంగా.

తన చేతులలో వులిక్కిపడి సట్లయిన మంజులని యింకా దగ్గరగా తీసుకుంది పద్మావతి నవ్వుతూ.

"అమె..." శేషగిరికి ఆ వాక్యం ఎలా పూర్తి చెయ్యాలో తెలియలేదు.

"మనం విన్నది పొరబాటు. మా మామ గారే పొరబాటు పడటంతో అవార్త అలాగే ప్రచారం అయింది. అయినా అదీ ఒకందుకు మంచిదేలే. నన్ను లెక్క చెయ్యకుండా పట్టు దలతో వెళ్ళిపోయి, పిల్లవాడిని పెట్టుకుని ధైర్యంగా బ్రతుకుతోంది అని తెలిస్తే, నాలో యింకా పౌరుషం, రోషం పెచ్చు పెరిగి ఎప్పటికీ పశువుగానే వుండిపోయే వాడిని. ఆ నీలి వార్తే నాలో పరివర్తన తీసుకువచ్చింది."

"అయితే నన్ను చూడగానే గుర్తు పట్టారా?" ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవి చేసుకుని అడిగింది మంజుల.

పద్మావతి గోముగా ఆమె చెంపలు నిమురుతూ,

"చూడగానే గుర్తుపట్ట లేదనుకో. కాని నాకు బాగా పరిచయం వున్న పోలికలు కొట్టవచ్చినట్టు కనిపించి నివ్వెరపోయాను. హరి మీ మామయ్య పేరు చెప్పగానే గ్రహించ కున్నాను." అంది.

ఆనాటి సంఘటన తనని చూడగానె ఆమె నిశ్చేష్టయ్యిపోవటం తరువాత ఎంతో ఆప్యాయంగా చనువుగా మాట్లాడటం అలా మాట్లాడేటప్పుడు సుదర్శనంగారి ఆరోగ్య విషయాలు అడిగి తెలుసుకోటం అన్నీ గుర్తు వచ్చాయి మంజులకి.

"నిన్ను చూడగానే నాకీ వూహవచ్చినా, అయిన వాళ్ళందరిని వదులుకుని అజ్ఞాతంగా జీవితం గడుపుతున్న నేను అంత అదృష్టానికి నోచుకోలేదనిపించింది."

మంజుల చటుక్కున ప్రక్కకి తిరిగి హరీష్ వంక చూసింది. "ఇదేనా మీరు చెప్పిన అభ్యంతరం?" అన్నట్టున్నాయి ఆ చూపులు.

హరీష్ అర్థవంతంగా చిరునవ్వు నవ్వాడు.

మంజులకి కోపం వచ్చేసింది. "ఇదో పెద్ద అభ్యంతరమా? అనాడే చెప్పివుంటే

# అర్ధాంగి

తనెంత సంతోషించేది? ఎంత ప్రోత్సాహం పడినా కారణంచెప్పకుండా తప్పించుకున్నాడు" అలా మూతిముడుచుకునే, "అయితే నాకెందుకు చెప్పలేదు." అంది.

"అదేమిటి మంజూ, అప్పుడే బావతో తగూ మొదలు పెట్టావా?.. ఇటు చూడు, వారంరోజుల క్రితం దాకా పాపం హరికి ఏమీ తెలియదు. అప్పుడైనా, అందరూ నన్ను వదిలి వెళ్ళిపోయారని జాలిపడి మీ అత్తయ్యకి చెప్తే, ఆవిడ పాత సంగతులు మరిచిపోయి నన్ను క్షమించి, అబ్బాయికి అంతా చెప్పేసి నన్ను యింటికి తీసుకు వచ్చింది."

"ఇప్పుడవన్నీ ఎందుకులెండి" వారించ బోయింది పద్మావతి.

"చెప్పనీ ఫరవాలేదు. మంజుకి నన్ను గురించి అంతా తెలుసు. మేనమామననే పక్షపాతంతో నా తప్పులు కప్పిపుచ్చుతుందేమో అంతే. ఇది విను మంజూ, యుగ యుగాలుగా భారత స్త్రీ రక్తంలో అంతర్లీనమైపోయిన ధర్మనిరతి, క్షమాగుణం నాలాంటి పాపాత్ముడు కూడ హాయిగా ప్రశాంతంగా బ్రతకగలిగేలా చేస్తున్నాయి. ఈనాడు నేనీ స్థితిలో వున్నానంటే దానికి కారణం మీ అత్తయ్య ఔదార్యమే. ఆమె దేవత.. ఏమిటి బావా అలా చూస్తున్నావు? విను, ఆ సంగతి కూడ చెప్పాలనుకుంటున్నాను. ఇందుకుపూర్తిగా వ్యతిరేకమయిన గుణాలు కలిగిన స్త్రీలు కూడ అక్కడక్కడా ఎదురు బదురుగా వుంటారు. దురదృష్టవశాత్తు అలాంటి వ్యక్తితో కూడ పరిచయం అయింది. స్త్రీ హృదయంలోని ఔన్నత్యాన్నే కాకుండా, స్వార్థపరురాలైన స్త్రీ ఎంత నిర్దాక్షిణ్యంగా ప్రవర్తించగలదో, తన కార్యసాధనకై ఎంత నైచ్యానికి దిగజారిపోగలదో నేను అనుభవపూర్వకంగా గ్రహించుకున్నాను. అయినా, అర్ధాంగి..." అంటూ నవ్వుతూ భార్య వైపు చూశారు. ఇంక ఆయన ధోరణి అలాగే కొనసాగుతుంది అని గ్రహించుకున్న పద్మావతి, ఆయన మాటలకి అడ్డువస్తూ, "మంజూ, మీ మామయ్యతో కబుర్లు చెప్తూండమ్మా.

నేను వెళ్ళి కాఫీ అదీ తీసుకువస్తాను." అని వెళ్ళబోయింది.

"ఊహూ. నేనూ మీతోనే వస్తా" అంటూ ఆమె చెయ్యి వదలకుండా ప్రక్కనే నడవ సాగింది మంజుల.

ఆ వెళ్తున్న వాళ్ళని వారిస్తూ శేషగిరి అన్నాడు. "ఇప్పుడు కాఫీఫలహారం అంటూ హడావిడి ఏమీచెయ్యకండి. అవన్నీ హోటల్లో పూర్తి చేసుకునే బయలుదేరాం. నేను వచ్చిన పని తెమిలిపోతే మధ్యాహ్నమే వెళ్ళిపోతాను. మరి అక్కగారూ! మీ అబ్బాయితో...."

"అక్కర్లేదు. మా హరి మనసు నాకు తెలుసు." అందిపద్మావతి మంజుల ముంగురులు సవరిస్తూ.

"ఇంకేం, త్వరగా వెళ్ళి మా వాళ్ళకి ఈ శుభవార్త అందించి, ఇక ఆ ప్రయత్నంలో వుంటాను. మీరు ముహూర్తం పెట్టించి వ్రాయండి" అంటూంటే ఆయన కంఠం ఆర్ద్రమయిపోయింది. "సుశీ వుంటే, మేనల్లుడే అల్లుడవుతున్నందుకు ఎంత సంతోషించేదో... తను ఎప్పుడూ మీగురించే చెప్తూండేది." అన్నాడు.

సుశీల స్మృతితో అందరి హృదయాలూ ఆర్ద్రమయిపోయాయి. వాతావరణం ఒక్కసారిగా భారంగా నిశ్శబ్దంగా మారిపోయింది.

ఏమి తోచక ఎటో చూస్తున్న హరీష్, ఉన్నట్టుండి, "మంజూ, అదిగో అమెరికా వెళ్ళి వచ్చిన మీ బ్రాహ్మడొస్తున్నాడు" అన్నాడు నవ్వు దాచుకుంటూ.

అతను చూపించిన వేపు చూసింది మంజుల. ఓ చేతిలో పంచాంగం పట్టుకుని మరో చేత్తో ముక్కుపొడుం దట్టిస్తూ వస్తున్న బ్రాహ్మణుడు కనిపించాడు. చిప్పున హరీష్ వేపు తిరిగి మూతి ముచ్చటగా మూడు వంకర్లు తిప్పింది. తెల్లబోయి చూస్తున్న ముగ్గురికీ అంతా వివరించి, చెప్పాడు హరీష్. అందరి నవ్వుల తోటి ఆ ప్రదేశం ప్రతిధ్వనిస్తూంటే, అప్పుడే మెట్లు ఎక్కిన పురోహితుడు, వాళ్ళు ఎందుకు నవ్వుతున్నారో తెలియక తెల్ల బోతూ నిలబడిపోయాడు.

అది చూసి నవ్వాపుకుని, "రండి శాస్త్రి గారు, సరిగ్గా సమయానికి వచ్చారు. పెళ్ళి ముహూర్తం పెట్టాలి." అంటూ మర్యాదగా ఆహ్వానించింది పద్మావతి.

(అయిపోయింది)

# వారఫలం

**7-10-1966 శుక్రవారం మొదలు**
**13-10-1966 గురువారం వరకు.**

**మేషం :** వృత్తివ్యాపారాల్లో కొంచెం శ్రమకలిగినా, దానికితగిన ప్రతిఫలం లభించగలదు. కొన్ని వ్యవహారాల్లో మీరుమొగమాటాలకు లొంగిపోవడం వలన అవసరమైన కార్యభారాన్ని వహించవలసివస్తుంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. శుభమూలంగా వ్యయం జరుగుతుంది.

**వృషభం :** వ్యాపారంలో మీరు యిదివరకు కొన్ని వ్యవహారాలను నిర్లక్ష్యం చేయడంవలన యిప్పుడు యిబ్బంది కలుగుతుంది. సాహసముతోకూడిన వ్యవహారాలు స్వల్పంగా లాభిస్తాయి. వృత్తిలో సమయానికి మిత్రుల సహకారం లభిస్తుంది. ఉద్యోగంలో స్వల్పభేదాభిప్రాయాలు రావచ్చును. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ కార్యక్రమాలు శ్రమమీద నెరవేరతాయి. అలంకారవస్తువులు కొంటారు.

**మిథునం :** మీరు స్వంతంగా చేసే వ్యాపారాలకంటే భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. ఆర్థిక వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. వృత్తిలో సాటివారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. ఉద్యోగంలో గౌరవంబాగా ఉంటుంది. సాంఘిక కార్యక్రమాల్లో శ్రమకలుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. బంధువులకు సహాయం చేస్తారు.

**కర్కాటకం :** ఆదాయంమాట యెలా ఉన్నా, అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగా ఉంటాయి. ఆర్థికంగా మీ స్వంతవ్యవహారలు బాగా ఉంటాయి. కాని యితరుల నిమిత్తం శ్రమపొందవలసి వస్తుంది. ప్రయాణాలు లాభించగలవు. సంతోషకరమైన వార్తలను వింటారు. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబవ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**సింహం :** వారం ప్రారంభంలో వృత్తివ్యాపారాల్లో చికాకులు యేర్పడి తరువాత సర్దుకొంటాయి. రావలసిన డబ్బుమీద ఆధారపడి యితరులకు వాగ్దానాలు చేయడం తగదు. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని నమ్మించి మోసంచేయడానికి ప్రయత్నిస్తారు. ఉద్యోగంలో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది.

**కన్య :** వృత్తివ్యాపారాల్లో మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరుతాయి గాని వారం మధ్యలో వ్యయప్రయాసలకు గురికాగలరు. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. ప్రయాణాల్లో శ్రమ అధికంగా ఉంటుంది. అధిక వ్యయంజరుగుతుంది. సాంఘిక కార్యక్రమాలకు మార్పులువస్తాయి.

స్త్రీలకు— ప్రయాణాలోచనలు చేస్తారు. దైవకార్యాలు నెరవేరతాయి.

**తుల :** వృత్తివ్యాపారాల్లో ఆదాయంతోపాటు వ్యయంకూడా పెరుగుతుంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లోయిదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. సాహసముతోకూడిన వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహిత్యకళారంగాల్లో మీకృషి రాణించగలదు.

స్త్రీలకు— స్వల్ప అనారోగ్యం చేస్తుంది. శుభకార్యాలవిషయంలో మీప్రయత్నాలు ఫలించగలవు.

**వృశ్చికం :** వ్యాపారంలో మీరు యిదివరకు చేసిన ప్రయత్నాలు యిప్పుడు ఫలిస్తాయి. వృత్తిలో కొత్తవారి పోటీని యెదుర్కోవలసి వస్తుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. విలాసవస్తువులు కొంటారు.

**ధనుస్సు:** వారం ప్రారంభంలోనే వృత్తివ్యాపారాల్లో ఆందోళన కలిగించే పరిస్థితులు యేర్పడుతాయి. సాహసముతోకూడిన వ్యవహారాల్లో జోక్యం చేసికోవడం తగదు. ఉద్యోగంలో ముఖ్యమైన నిర్ణయాలు వారాంతంలో చేయడం మంచిది. అధిక వ్యయం జరుగుతుంది. అనుకూలవార్తలను వింటారు.

స్త్రీలకు— బంధుమిత్రులను కల్సుకొంటారు. సాహిత్యకళారంగాల్లో ఖ్యాతిలభిస్తుంది.

**మకరం :** ఏవ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన అనుకూలత ఆఖరువరకు నిలవదు. నూతన వ్యాపారాల్లో శ్రమఅధికంగా ఉంటుంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికి వదలివేయడం మంచిది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. మానసికాందోళన కల్గుతుంది.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**కుంభం :** వృత్తివ్యాపారాల్లో సాటివారితో పోటీ పెరగడంవలన మీకార్యక్రమాలను మార్చుకోవలసి వస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందకపోవడంవలన యిబ్బంది కలుగుతుంది. ఉద్యోగంలో మీకృషిని అధికారులు గుర్తిస్తారు. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటాయి. కుటుంబ సంతోషం లభిస్తుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. పాటివారిలో గౌరవం లభిస్తుంది.

**మీనం :** కొన్ని వ్యవహారాల్లో మీమంచితనమే మీకు యిబ్బందిని కలిగిస్తుంది. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాల్లో నూతనావకాశాలు లభిస్తాయి. సాటివారితో వాదప్రతివాదాలకు దిగడం మంచిదికాదు. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో స్వల్పభేదాభిప్రాయాలు వస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

—మహేష్ ●


బలము మరియు శక్తి కోసం!
పాలు
కోకో
మాల్ట్
పంచదార
క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా
BENSONS/1-CF-23


Cadbury's
Bournvita
THE IDEAL FOOD DRINK
FOR STRENGTH AND VIGOUR
బోర్న్‌విటా పోషకత్వమునకు సముచితమైనది.
కండరములు మరియు టిస్యూలను బలపరచుటకు ప్రోటీన్‌లు,
బలము మరియు శక్తి కోసం కార్బోహైడ్రేట్‌లు, ఎముకలను
దృఢముగా చేయుటకు ఖనిజ లవణములు మరియు ఆరోగ్యమునకు
అతి ముఖ్యమైన విటమిన్‌లు మీకు లభించును. బోర్న్‌విటా
తయారు చేసుకోవడం సులభం మరియు అది రుచిగా కూడా నుండును!

# గుడిగంటలు




## కె.వి.నాగేశ్వరరావు

గుడిగంటలు నిర్విరామంగా మ్రోగుతున్నాయి. ఆలయంలో దేవునికి హారతిస్తున్నాడు పూజారి. భక్తిపూర్వకంగా నమస్కరిస్తూ ఆకాశ్వేపు ఇహాన్నిమరచి, ఆత్మని ఆ దేవదేవుని చరణద్వయం వద్ద సంలగ్నం చేసి, మంత్రముగ్ధులయినట్టు పారవశ్యంలో మునిగి తేలుతున్నారక్కడ ఉన్న వాళ్లందరూ.

కానీ, నిత్యమూ హృదయ ఫలకం మీద నటించే భక్తి తరంగాలు తన ఆత్మను పెనవేసుకుని ఉన్న ఏదో తెలియనివలయాలను పరాజితులు చేయలేకపోయాయా నాడు. పూజారుల మంత్రోచ్చారణలు, గంటల గణగణలు ఆలయ ప్రాంగణంలో మారుమ్రోగుతున్నప్పటికీ ఆమె మాత్రం ప్రకృతి మూగపోయినట్టు, ఆ ఆలయానికి అపరిచిత అయినట్టు చపలచిత్తంతో ఎటో చూస్తూ నిల్చుంది. అక్కడి వాళ్లందరితో పాటు తనూ మనస్ఫూర్తిగా, భక్తి పూర్వకంగా యాచిద్దామని ఎంత ప్రయత్నించినా ఆమె మనస్సు నిలుపలేకపోయింది. కారణం? ఆమె ఎప్పుడూ ఇలా అస్థిరంగానూ చంచలంగానూ లేదే? ఆమె కేమయ్యింది? ఎందుకీ మనశ్చాంచల్యం??

ఆమె రెప్ప వాల్చకుండా చూస్తూ వుంది. దేవుణ్ని కాదు, ఎవరో అపరిచితుడిని. చూపులు కలిసినప్పుడు అప్రయత్నంగా ఆమె రెప్పలు మూసుకునేవి. కాలి బొటనవ్రేలితో నేలను తవ్వే అసఫలప్రయత్నం చేసేదప్పుడప్పుడు. ఇద్దరూ ఒకరికొకరు ఎన్నో రోజులు, నెలలూ, సంవత్సరాల నుండి పరిచితులయినట్లు చూసుకునేవారు. "ఎటువంటి అపరిచిత పరిచయం?" విస్మయం చెందేదామె.

"హారతి" పూజారి మాటలు ఆమె ముద్రను భంగపరిచాయి. లేకపోతే తన అస్తిత్వాన్నే కోల్పోయేదేమో? హారతి, ప్రసాదం తీసుకుని వెళ్లబోయేముందు ఒక్కసారి ఆ అపరిచితుడ్ని చూడాలని బలవంతంగా కోరాయామె కళ్లు. ఏముందీ? మళ్లీ చూపులు కలియటం, యథాప్రకారం రెప్పలు వాలటం క్షణంలో జరిగిపోయాయి. అస్థిరంగా అడుగులువేస్తూ "ఎవరు? ఎక్కణ్ణించొచ్చాడు??" మొదలయిన ప్రశ్నల ప్రవాహంతో కొట్టుకుపోయింది.

"ఎవరామె? ఆత్మీయత ఉట్టిపడే ప్రసన్న వదనంతో ఎంత చక్కగా వుంది!" భావ పూరితంగా ధర్మసత్రం వేపు నడిచాడతను.

దేవ దర్శనానికి వచ్చే భక్తులు స్వామి వారి సాముహికపూజలకు సకాలంలో చేరుకొనగలిగేందుకూ, అన్నిటికీ అందుబాటులో ఉండేందుకూ, ఆలయ ప్రాంగణానికి ఆనుకుని కట్టబడి ఉందా సత్రం. అధికారులు కూడా దేవస్థానంవారే. పసివాని ఏడుపు వినబడగానే అడుగులు గబగబా వేశాడు.

మధు లేచి ఏడుస్తున్నాడు. కాని "ఆమె..??" క్షణంసేపు తన కళ్లను తనే నమ్మలేకపోయాడు. "ఇది నిజమా లేక భ్రమా?" అసమంజసంలో పడ్డాడు.. మాట్లాడదలచి కూడా మాట్లాడలేకపోయాడు. ఉచ్చారణ జిహ్వాగ్రం వరకూ వచ్చి ఆగిపోయింది, ఎలా సంబోధించాలో తెలియక అప్పుడే మందిరంలో చూసిన ఆ దేవతన్న

తన మనోమందిరంలో నిలుపుకునేందుకు అయోగ్యులెవరా అన్న సంకోచంలోపడ్డాడు.

ఆ అపరిచిత, ఏడుస్తూన్న మధును తన ఒళ్ళోకి తీసుకుని ఆడిస్తూ, లాలిస్తూ వుంటే, ఎందుకో అతనికి తమాషాగా చూడా లనిపించింది. మధుస్మృతులు హృదయంలో నర్తించి నీటి మీద గీతలా మాయమయ్యాయి.

మధు ఏడుపు తగ్గించాడు.

"ఎవరి బాబువమ్మా నువ్వూ..?" ఎవరన్నా కనుపిస్తారేమో అని వెతుకుతూ అందామె.

"చూడండి..." ధైర్యం చేజిక్కించుకుని అనాలోచితం అనగలిగాడు. తరువాత ఏం చెప్పాలో తెలియక, ఒకరి ముఖాన్ని ఒకరు చూసుకున్నారు క్షణంసేపు. వెంటనే తలలు దించుకున్నారు. కాలి క్రిందనున్న సిమెంటు గచ్చులో తమ ప్రతిబింబాలు వెతుక్కొనడానికా అన్నట్లు.

ఆహా! ఎటువంటి మధురక్షణం? ఒక అపరిచిత యువకుడ్ని తన ముందు చూసి ఒక హిందూ కన్యారత్నం లజ్జితావస్థ యొక్క సుందర దృశ్యం. వాళ్ళిద్దరిలో యింకా నేటి సభ్యతల దానవత్వం అంకురించ లేదని నిరూపించే అనుపమాన సమాగమం. లేకపోతే......

"మీ పేరు?" పురుషుడి ప్రాకృతిక అధికారం అతనిని ఉత్తేజపరిచింది.

"రాధ" లజ్జితావస్థలో కూడా పలువరేకుల్లోంచి రెండక్షరాలు రత్నాల్లా రాలాయి. "మీరు.." ఏదో అడుగుదామని సిగ్గుపడిందామె.

"నా పేరు రాజా" పరిస్థితి సర్దుకుని ప్రశ్న నూహించి జవాబు చెప్పాడు. "వీడు మా అబ్బాయి, మధు"

"మధు, చాలా చక్కటి పేరు" చంటి వాని బుగ్గలు నొక్కుతూ తలెత్తి చూచింది.

"....." రాజా ఆమె కళ్ళలోనుంచి హృదయంలోకి తొంగి చూస్తున్నాడు.

"పెళ్ళమ్మగారేరీ?" వాస్తవంగా ప్రతి ఒక్కరూ అడిగే ప్రశ్న.

"పెళ్ళమ్మా???" చెవుల్లో పిడుగు పడినట్లయింది రాజాకి. క్షణంలో కలకల లాడే ముఖాకృతి మారిపోయింది. అతని ముఖంలోని భావావేశం రాధ హృదయాన్ని అసమంజసంలో పడేసింది, యింతకీ కారణ మేమిటో ఆమె కర్థమవలేదు.

తన జీవితంలోని కొన్ని అమూల్య క్షణాల్ని స్మరిస్తూ పరిస్థితుల ప్రభావానికి మానవుడు ఎప్పుడు, ఎక్కడ, ఎలాంటి ప్రశ్నను ఎదుర్కొనవలసి వస్తుందో అన్నది అనూహ్యమయిన సమస్య అన్న నిర్ధారణకి వచ్చాడు. కళ్ళు చెమ్మగిల్లాయి. గొంతు జీరవోయింది.

"పెళ్ళమ్మ, పెళ్ళమ్మ మనకు దూరం.. చాలాదూరంలో ఉంది.." నిశ్వాసతో అన్నాడు రాజా. "ఎంతదూరమంటే.. సజీవంగా నేనక్కడికి పోలేను" రెండు కన్నీటి బొట్లు నేల మీద పడటంతో సగం హృదయభారం తగ్గినట్లయింది. యోగిలా గంభీరంగా చిరుమందహాసంతో "మీరర్థం చేసుకున్నా రనుకుంటాను" అన్నాడు రాధ కళ్ళల్లోకి చూస్తూ.

ఈవయస్సులో యింతటి అఘాతమా? రాధ కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

"అరే! మీరెందుకు కంట తడి పెడుతున్నారూ? ఓ! క్షమించండి. నా దుఃఖాన్ని మీ ముందుంచి మిమ్మల్ని బాధ పెట్టడం నాకిష్టంలేదు" మరొక్కసారి రాధ కళ్ళను పదివాడు. రాధ కనురెప్పలు బరువుగా వాలాయి. కళ్ళు తుడుచుకుంటూ "కాదు, క్షమించమని అడగాల్సింది నేను. అనవసరంగా తెలియని ప్రశ్నలతో మానిన గాయాన్ని తిరిగి గాయపరిచాను."

"అబ్బే! దానికేముందిలెండి" మాట మారుస్తూ అడిగాడు రాజా. "మీగారుండేది ఏ గదిలో?"

"మాది ఈ ఊరే. ఆ కనపడేదే మా యిల్లు" ఎదురుగానున్న చిన్న పెంకుటింటిని చూపిస్తూ "ఆ కూర్చుని ఉన్నావె మా అమ్మనుమ్మ"

"ఓహో! అలాగా? ఎవరో యాత్రికులను కున్నాను. అందుకే ఏగది అని అడిగాను" సహజ ధోరణిలో నవ్వాడు. రాధ కూడా చిన్నగా శృతి కలిపింది.

అప్పుడే ధర్మసత్రంలోని మనుష్య సంచారం భ్రాతృత్వాన్ని కూడా శంకిత దృష్టితో చూచే కర్తవ్యపారాయణతను పాటించటంతో యిరువురూ అక్కడ ఎక్కువ సేపు ఉండటం మంచిదికాదని గ్రహించారు. అందరి దృష్టి వాళ్ళవేపే ఉన్నట్లు అనిపించింది.

"మరి నే వెళ్తాన్నండీ" అంది రాధ సస్మితగా.

"మీ యిష్టం" అయిష్టంగా అన్నాడు. "మొదటి పరిచయంలో కనీసం కాఫీ అయినా యివ్వకుండా పంపిస్తున్నందుకు క్షమించాలి. అయినా మిమ్మల్ని ఉండమనే అధికారం నాకేదీ?" నమ్రతగా అన్న ఆ మాటలు రాధ నాకర్షించాయి.

అప్పుడే కళ్ళుమూసిన మధును తన చేతిల్లోకి తీసుకుంటూ రాధ కరస్పర్శతో చలించిన రాజా, రాధ కళ్ళల్లో అదే కారణంగా సృజించిన రక్తిమార్చనలు చూచి పరవశుడయ్యాడు.

నవ్వుకుంటూ వెళ్ళిపోయిందామె.

ఆమె అడుగులు చూస్తే అయిష్టంగా పడుతున్నట్లనిపించింది రాజాకి. కాళ్ళనించి క్రమంగా శిరోజాలవరకూ ప్రసరించాడు దృష్టిని. ఏడడుగులు వేసి ఊహించినట్లుగా ఆమె వెనుదిరిగి చూడటంతో ఎంతో ఆనందించాడు రాజా. ఆమె నేపు తదేక దృష్టితో చూస్తూన్న రాజాని చూచి సిగ్గుతెరలు ముంచుకొచ్చి గబగబా నడిచి వెళ్ళిపోయింది... క్రమంగా మాయమయ్యింది.

నిండు హృదయంతో రాజా గదిలోకి నడిచాడు.

*　　　*　　　*

గత రెండురోజుల పరిచయంతో రాధ పూర్తిగా ఆకర్షించింది రాజా హృదయాన్ని. ఈ విశాల ప్రపంచంలో రాధ లేకుండా జీవించటం కష్టమని అనుకున్న క్షణాలు లేకపోలేదు. ఒక్కొక్కసారి భావాత్మకంగా తనను తనే ప్రశ్నించుకునే వాడు "ఎందుకూ?"

"......................"

సమాధానం మాత్రం శూన్యం. జీవితంలోని స్మృతి పృష్ఠాల్ని ఎన్నోసార్లు తిరగవేసి చూచేందుకు ప్రయత్నించాడు. ఇటువంటి సంఘటనల ప్రభావం ఎప్పుడు ఎంతవరకూ తన హృదయంలో స్థానం ఏర్పరచుకుందా అని, ఎప్పుడయినా యిటువంటి పరిస్థితులలో డోలాయమానంగా మానసిక సంతులనాన్ని కోల్పోయాడేమో అన్న భ్రమ కూడా కలిగింది.

పురాతన అనుభూతుల సంస్మరణలో తనను తనే మరిచిపోయాడు. సమస్త శక్తులను కేంద్రీకరించి ఆలోచనల్లో మునిగిపోయాడు. మస్తిష్కంలో సముద్ర ఘర్జనలు ఘోషిస్తున్నాయి. తరంగాలు ఆకశాన్ని ముట్టుకునేందు ఉరకలేస్తున్నాయి. నిరర్థక ప్రయత్నం. కొన్ని వెల

టాలు సముద్రంనుంచి ఎంత త్వరిత గతిని ఒడ్డుకు వచ్చేవి, శాశ్వత కారాగారం నుంచి విముక్తి చెందడానికేమో అన్నట్లు మరుక్షణంలోనే ఆ వచ్చిన కెరటాలు అంత కంటే శీఘ్రంగా తిరిగి వెళ్ళిపోయేవి, తమ అమరస్నేహాన్ని నిరూపిస్తూ. ఈ అవినా భావ సంబంధం ఎన్ని యుగాలనుంచి ఉందో ఎవరికి తెలుసు?

అకస్మాత్తుగా ఒక పెద్ద కెరటం లేచి యథాప్రకారం ఒడ్డుని కౌగిలించుకుని వెళ్ళిపోయింది. కాని ఎప్పటిపలె కాకుండా ఏదో చిహ్నాన్ని విడిచి పెట్టి మరీ వెళ్ళింది. విశృంఖలమయిన రాజా ఆలోచనల్లో స్పం దన కలిగింది. జీవితంలోని ఒక అమూల్య సంఘటన గట్టిగా పెనవేసుకుందతని హృద యాన్ని.

సుధను మొట్టమొదటిసారిగా చూచింది, ఆమెను తన అర్ధాంగిగా పొందినది ఈఆలయ ప్రాంగణంలోనే. ఎటువంటి మధుర క్షణా లవి? ఎంత పక్కని సౌందర్యం? తన జీవిత శిల్పాన్ని కళాఖండంగా తీర్చిదిద్దింది ఆ ఆదర్శమూర్తియే. ఆనాడు భానుని అరుణ కిరణాలతో శోభిల్లే సాంధ్యసౌరభం వెను వెంట సమార్పణం చేసిన శోభసంలా, తన జీవితంలో ఉదయించినది మొదలు సర్వ దిశాలా వసంత శోభలతో నిండిన సుమధుర జీవితాన్ని ప్రసాదించి గృహమే స్వర్గసీమగా, జీవితమే ఇంద్ర ధనస్సుగా వెలతేని, మరువు రాని ఆనందంతో పూరించిన సుధస్మృతిలో మెదలగానే కన్నీళ్ళు జలజలా రాలిపోయాయి.

"దేవునికి కూడా మంచివాళ్ళ అవసరం ఉంటుందంటారు. అందుకేనేమో ఆమెను తన దగ్గరికి పిలిపించుకున్నాడు" అను కున్నాడు.

ధనాఢ్య కుటుంబంలో పుట్టకపోయినా, అష్టయిశ్వర్యాలలో తేలియాడకపోయినా, పెద్ద చదువులు చదవకపోయినా సుధ పంక జం వంటిది. ఆమె ఔదార్యం, భావాలు, సమయస్ఫూర్తి కేవలం ఒక ఆదర్శగృహిణి గానే కాకుండా నేటి కాలేజీలలో బి.ఏ.లు చదివే అమ్మాయిల కంటే ఎన్నో రెట్లు సుసజ్జిత అని నిరూపించాయి. నిండయిన ఆత్మవికాసంతో అన్నపూర్ణలా తిరిగేది పట్టింట.

సుధ జ్ఞాపకం రాగానే మనస్సులో ఎంతో మథనపడి కన్నీటితో నిండిన కళ్ళను బరు వుగా మూసుకుంటూ గతాన్ని మరచిపోదలి చాడు రాజా. ఇటువంటి తిమిరంతో నిండిన హృదయంలో ఒక చిన్నకాంతి కిరణం మిరు మిట్లు గొలిపినట్లయి క్రమంగా ఆశారేఖగా సాక్షాత్కరించి వెలుగు జిలుగులు చిమ్మింది. సుదూరాన రాధ అందియలు ఘల్లుమన్నట్ల యింది.

"ఒకవేళ రాధ సుధ యొక్క ప్రతిరూపం కాదు కదా?" ఆలోచనల్లో పడ్డాడు. "అదే స్నిగ్ధ సౌందర్యం, మమత, మమకారం మూర్తీభవించిన ప్రసన్న గాంభీర్య వదనం, యింకా ఏమిటి కాదని? ఒకవేళ భగవంతుడు సుధ ఆత్మను రాధ శరీరంలో ప్రతిష్ఠించి పంపించాడేమో నాకోసం!" తర్కంలోకి దిగాడు. "అలా ఎందుకనుకోవాలి? చిత్ర కారుడు ఏకాగ్రచిత్తుడై ఒక చిత్రాన్ని, చిత్రించిన వెంటనే మరో చిత్రాన్ని చిత్రిం చేందుకుపక్రమిస్తే, మొదటి చిత్రంలోని కొన్నిభావాలు అప్రయత్నంగా రెండవ చిత్రంలో కూడా ప్రస్ఫుటించటం సహజం. అలాగే భగవంతుడు కూడా." క్రమంగా కల్పనలోకి వచ్చాడు.

నిన్న సాయంత్రం రాధ అమ్మమ్మ అన్న మాటలు స్ఫురణకు వచ్చాయి. "నాకు రాధ తప్ప ఎవరున్నారు నాయనా! ఏదో పదవ క్లాసు వరకూ చదివింది. ఈడొచ్చిన పిల్ల. సంబంధాలు వెతుక్కుతిరిగే శక్తి నాకు లేదు. వేలకువేలు కట్నం యిచ్చి వరుణ్ణి కొని తెచ్చుకునే స్థోమత అంతకంటే లేదు. ఆ దేవుడు చల్లని చూపు చూచి, దానికి కళ్యాణ యోగమంటూ ఉంటే ఈ ఇల్లు ముక్క అమ్మేసి ఏదో ఆకాస్త పెళ్ళి అని పించేద్దామని ఉంది. ఇహ నాదేముంది, ఆ దేవుని సాన్నిధ్యంలో జీవితం చాలిం చేస్తాను." అంది ఆలయ గోపురానికి నమ స్కరిస్తూ.

ఈ మాటలు వినగానే రాధ లోపలికి పరుగు తీసింది. "ఎందుకో ఈ అమ్మాయిల కింత సిగ్గు? పెళ్ళి మాటంటే చాలు బుగ్గలు కందిపోయేలా సిగ్గుపడతారు" అనుకున్నాడు.

మరుక్షణం కాఫీ కప్పుతో వచ్చింది రాధ. ఆ క్షణంలో ఆ కాస్సేపూ అతని కంటికి నవవధువులా కనుపించింది. రాధ యిక రాజా ముఖంలోకి చూడలేకపోయింది సూటిగా. కాని రాజా ఎంత సేపయినా చూచేందుకు తీరుబడిగా కూర్చున్నాడు.

ఎవరో తలుపు తట్టిన చప్పుడయింది.

"ఎవరూ?"

"......" జవాబు శూన్యం. మళ్ళీ అదే చప్పుడు.

"తలుపు తెరిచే ఉంది, లోనికి రండి..." తలుపు వేపు చూస్తూ అన్నాడు రాజా మధును జోకొడుతూ.

తలుపు ఎంతకీ తెరుచుకోకపోవటం చూచి లేచిన రాజా సరిగ్గా అప్పుడే తలుపు తెరచు కోవటం చూచి ఆగాడు.

మళ్ళీ తలుపు మూసుకుంది. రాజా రెండడుగులు ముందుకు వేసి "ఎవరా?.." అన్నాడు తలుపు తీస్తూ. తిరిగి వెళ్ళబో తూన్న రాధ అడుగులు ఆగాయి.

ఆకాశంలో మబ్బులు దట్టంగా అలుము కున్నాయి.

"వెళ్ళిపోతున్నారేం..?" మందహాసంతో పలుకరించాడు.

"........." అదే మందహాసం.

"లోనికి రండి..." ఆహ్వానించాడు. మధు లేచి, ప్రక్కలో తండ్రిలేక పోవటంతో, చిన్నగా ఏడ్పు లంకించుకున్నాడు. "రండి" అంటూ లోనికి వెళ్ళాడు రాజా.

రాధ మెల్లగా గది లోపల అడుగు పెట్టింది.

"ఏడువకు నాన్నా.. చూడు మనింటికెవ రెవరు వచ్చారు.." బుజ్జగిస్తూ మధును జోకొట్టి మళ్ళీ నిద్ర పుచ్చటానికి ప్రయ త్నించాడు. వయస్సులో చిన్నవాడయినప్ప టికీ పరిస్థితుల ప్రభావం అతణ్ణి అనుభవ జ్ఞుణ్ణి చేసింది. కాని మధు ఏడ్పు మాన లేదు.

రాధ మధును తన చేతుల్లోకి తీసుకో బోయింది. మళ్ళీ అదే స్పర్శ. అదే ప్రశ్న యిరువురి హృదయాల్లో దోబూచులాడింది. నిశ్చల సలిలం మీద కోమల సమీర ప్రవా హంతో మధుర ప్రవాహం ఆవిర్భవించి నట్లు యిరువురి హృదయాల్లో అనురాగం పొంగి పొరలింది.

మౌనంగా కొన్నిక్షణాలు గడిచిపోయాయి. మధు నిద్రపోతున్నాడు.

"నిజంగా ఆడవాళ్ల చేతుల్లో ఏదో ఇంద్రజాలం ఉంది. చూశారా, అప్పుడే, వూరుకోవటం, నిద్రపోవటం కూడా జరిగి పోయింది."

"...." రాధ చిన్నగా నవ్వుకుంది. రాజా ఎదుట దాగింది కాదా నవ్వు. రాజా కూడా

దాచలేకపోయాడు.

"అన్నట్లు అలాగే కూర్చోండి. అయిదు నిముషాల్లో కాఫీ చేసి తెస్తాను" చిటికె వేస్తూ వెళ్ళిపోయాడు.

"అబ్బే!...." రాధ మాటపూర్తి చేసే లోగా నోటి దగ్గర చూపుడు వ్రేలు నుంచి "ష్!!... మధు లేచిపోతాడు" అన్నాడు చమత్కారంగా.

"మీకెందుకా శ్రమ?" అతని చమత్కారాన్ని అర్థం చేసుకుని మధును చాప మీద పడుకోబెడుతూ అందామె.

"ఇందులో శ్రమేముంది? నాకెలాగూ కాఫీ టయిమయింది. ఇంకో గ్లాసు నీళ్ళు ఎక్కువ పోస్తే చాలు" ఎంతో సహజంగా అన్నాడు.

"కాఫీ అయిపోతుంది" పూర్తి చేసింది రాధ చేతులు త్రిప్పుతూ "అంతే!" అన్న రాజా మాటలు విని ఇద్దరూ నవ్వుకున్నారు.

ఇప్పుడు యిద్దరూ మానసికంగా చాలా దగ్గరకు చేరుకున్నారు. కాని సమాజం, సంఘం, లోకులూ కాకులూ అన్న భయానికి లొంగి మనసులోని భావాలను బహిర్గతం చేయలేక ఆలోచనలతో ఆందోళన చెందుతున్నారు.

ఈ రెండురోజుల స్నేహాన్ని అధికారంగానూ, పరిచయాన్ని ఆధారంగానూ పునస్కరించుకుని "నేను కాఫీ త్రాగుతాను, కానీ ఒక్క షరతు" అంది రాధ.

"మీ అన్ని షరతులూ నాకిష్టమే.. మీరు కాఫీ త్రాగితే అంతేచాలు, ఏమిటో త్వరగా చెప్పండి" అన్నాడు చిలిపిగా.

"మీ చేతి కాఫీ మాత్రం త్రాగను" అందామె నవ్వుతూ. రాజా మనస్సు చివుక్కుమంది. "నేనొంటరివాడినని మీకు తెలుసు. అయితే మీకు కాఫీ యివ్వగలిగే భాగ్యం నాకు లేదన్నమాట" గంభీరంగా అన్నాడు చిట్లాగ్రుస్తూ.

"నా ఉద్దేశ్యం అదికాదు. కాఫీ నేను కాస్తాను. మీరెందు కనవసరంగా బాధపడతారు" రాధ మాటలు విన్న రాజా ముఖంలో దీపావళి కాంతులు వెదజల్లినట్లుయింది. మనస్సులోని కోరిక ఈ విధంగా ఫలించినందుకు మహదానందభరితుడై ఆలోచించ సాగాడు. ఆమెను ఎలా సమర్థించాలా అని. తన మనోఫలకం మీద ఊహించుకున్న పూహాప్రతిలే రాధ యేమో?

"మీ యిష్టం...వేరుగా భావించినందుకు క్షమించండి" అన్నాడు.

రాధ స్టవ్ వెలిగించి కాఫీ ప్రయత్నంలో నిమగ్నురాలయింది. ప్రేమ పూరితనయనాలతో వీక్షిస్తూ ఆమె అందాన్ని కళ్ళతోనే ఆస్వాదిస్తున్న రాజాను చూచి అప్పుడప్పుడు సిగ్గుపడేది రాధ. రాజా ఆమెకు కాఫీ పొడి, చక్కెర అందిస్తూ ఉడత సహాయం చేస్తు అమృతం లాంటి కాఫీ త్రాగిన రాజా ఈనాటి ఆ ఘనతంతా ఆమె కొక్కదానికే దక్కకుండా ఉండేందుకేమో! ఎంతయినా మగవాడు, ఆమాత్రం స్వార్థం లేకపోతే ఎలా? మధ్య మధ్య అదే స్పర్శతో అదే ప్రశ్న కలిగి ఏదో భావం రగిలి, నూతన స్పందనతో ఒళ్ళు పులకరించేది.

"మిమ్మల్నొక విషయం అడుగుతాను... చెబుతారా?" ఎంతో భయంగా అడిగింది

రాధ, తలెత్తి.

"అడగండి, దానికేం.." రాజా మాటలు ఆమెకు ధైర్యాన్నిచ్చాయి.

"మీరు మళ్ళీ బాధ పడతారేమో?" అంది స్వవంతగా తటపటాయిస్తూ.

"అబ్బే! ఇందులో బాధపడేందు కేముంది?" పాలగ్లాసు అందించి ప్రక్కనే నిల్చున్నాడు రాజా.

"మీరు మళ్ళీ పెళ్ళెందుకు చేసుకో లేదు?" ఒకరి జీవితానికి సంబంధించిన విషయాలలో కలుగజేసుకునే అధికారం ఆమెకు లేదన్న సంగతి తెలిసుండి కూడా సాహసించింది రాధ.

ఇప్పటికి తనను ఎందరో అడిగిన ప్రశ్నే అయినప్పటికీ, ఇటువంటి పరిస్థితిలో, అదీ రాధ ఈ ప్రశ్న అడగటం అనూహ్యంగా తోచింది రాజాకి. సమాధానం ఎలా ఇవ్వాలో ఒక విధంగా అవగాహన కాలేదు. పురాతన స్మృతులను కూడగట్టుకుని ఎటో చూస్తూ ప్రారంభించాడు.

రాధ ప్రతిమలా చూస్తూ నిల్చుంది.

"అదొక పెద్ద కారణం.." నిదురపోతూ వున్న మధు ప్రక్కకు చేరాడు. తల మీద చెయ్యివేసి నిమురుతూ తదేకంగా చూస్తూ "యిప్పటికి రెండు సంవత్సరాల క్రితం నాటి మాట...మధు ఈ ప్రపంచంలోని భయంకర గాలివానల్ని చవి చూసేందుకు జన్మించి జీవితపు మొదటి వెలుతురు చూచిన రోజూ, వీళ్ళమ్మకు అంతిమ ఘడియలు తెచ్చిన రోజూ ఒక్కటే. తల్లిపాలన్నా చవి చూడని పసివాణ్ణి నా చేతుల్లో పెడుతూ ఒకే ఒక్క కోరిక కోరింది.." ఆనాటి భయంకర సన్నివేశాన్ని తన కళ్ళముందు సహజంగా చిత్రించుకుంటూ చెబుతున్నప్పుడు, పదే బాధ చూస్తే ఎందుకడిగేనా అన్నట్లు బాధపడింది రాధ. కాని ఏం చెప్తాడో అని ఆశ నిరాశల మధ్య సతమతమవుతూ రాజా మాటల కోసం ఆత్రుతగా ఎదురు చూస్తూ నిల్చుంది.

"బాబు కన్యాయం చేయకండి.. వీణ్ణి కన్నబిడ్డలా చూసుకునే ఆదర్శమూర్తిని తప్పకుండా వివాహం చేసుకోండి." అని కళ్ళు మూసింది శాశ్వతంగా" ఎంతో బాధతో చెప్పగలిగాడు.

నిరాశ నిస్పృహల నుండి కొంచెం తేరు కుంది రాధ.

"ఇప్పటివరకూ అటువంటి ఉత్తము రాలు లభించలేదు" దీర్ఘ నిశ్వాసతో రాధ వేపు చూస్తూ "యిక లభించదేమో?"

# గుడిగంటలు

అన్నాడే కాని ఈ ఆఖరి వాక్యం హృదయం నుంచి వచ్చిందికాదు, కేవలం రాధను పరి కిస్తూ అన్నదే.

"ఎందుకు లభించదూ?" రాధ ఆత్మ విశ్వాసంతో అంది కాఫీ దింపుతూ "మీరు సరిగ్గా గమనించలేదేమో!"

గ్లాసుల్లో కాఫీ నింపుతున్నట్లే రాధ రాజాల హృదయాలు కూడా అనురాగంతో, ప్రేమతో నిండుకుంటున్నాయి. తను త్రాగ నంతసేపూ ఆమె కూడా కాఫీ తీసుకోక పోవటం గమనించిన రాజా మొదట ఆస్వా దించాడు నవ్వుతూ. యిద్దరూ కాఫీ త్రాగారు. మధు కోసం కొంచెం ఫ్లాస్కులో పోసింది రాధ. ఈ సంగతి కనిపెట్టిన రాజా మరింత ప్రభావితుడయ్యాడు.

అతని చేతిలోని గ్లాసు లాక్కొని గబ గబా కడగబోయింది రాధ.

"ఇదేమిటండీ, కాఫీ కాచి పెట్టింది కాకుండా గ్లాసులు కూడా.."

"ఎన్నిసార్లు చెప్పాను మీకు నన్ను 'మీరు' అనొద్దని?" అధికారపూరితమయిన చిరుకోపం ప్రదర్శించింది.

"అలాగేనండీ! ఇంకెప్పుడూ మిమ్మల్ని 'మీరు' అనన్లెండి" భయం నటిస్తూ సవినయంగా అన్నాడు రాజా.

ఇద్దరూ ఫక్కున నవ్వుకున్నారా ప్రసక్తి వనకి. ఇది విని మధు మేల్కొన్నాడు చిన్నగా ఏడుస్తూ. అప్రయత్నంగా యిద్దరూ ఒకే సారి మధు వేపు తిరగటం, ఒకరి కొకరు ఢీ కొనటం, యిద్దరి శరీరాలు పులకించటం, ముఖ్యంగా రాధ సిగ్గుపడటం క్షణంలో జరిగి పోయాయి. రాజా కళ్ళల్లోకి చూడటంలో పరావశ అయిన రాధ కళ్ళు మధు వేపు తిరి గాయి. మధును తన ఒళ్ళోకి తీసుకుని ఫ్లాస్కులోని కాఫీ పోసి త్రాగించింది.

"ఏం నాన్నా చాలా?" అంది.

ఇది చూచిన రాజా పారవశ్యంతో ఉప్పొంగి పోయాడు. "ఏంనాన్నా" అన్న రాధ మాటలు చెవుల్లో గుడిగంటల్లా అమృత ప్రాయంగా మ్రోగుతున్నాయి. ఈ మాటను మధు శాశ్వతంగా పదేపదే వినేందుకు, ఇదే మమతా పూరితమయిన పిలుపుతో మధు ఎల్లప్పుడూ పిలువబడేందుకు, జీర్ణావస్థలో నున్న తన జీవిత భగ్నావశేషాల్ని కూడగట్టి కళాఖండంగా తిరిగి నిర్మించుకునేందుకు, రాధ సారథ్యం, సాన్నిహిత్యం ఎంతో అవసర మనీ, అనివార్యమని రాజా మనస్సులో బల

మైన నమ్మకం ఏర్పడింది. కాని "ఎలా ప్రస్తావించటమా?" అన్నదే పెద్ద ప్రశ్నయి కూర్చుంది.

అప్పుడప్పుడు మానవుని కల్పన, ప్రయ త్నాలను సాకారం చేయటానికి భగవంతుడు కూడా ఉపక్రమిస్తూ రూపంలో సహాయం చేస్తాడనటంలో సందేహంలేదు. ఆకాశంలో నల్లనిమబ్బులు ఘనీభవించి ఉరుములతోపాటు ఒక్కపెట్టున పెద్దగాలి వీచి గది తలుపులు పెద్ద శబ్దంతో తెరుచుకున్నాయి. చెట్ల ఆకులూ, గడ్డి, దుమ్మూ అంతా గదిలోనికి రావటంతో మళ్ళా ఒకేసారి ఇద్దరూ అప్రయ త్నంగా తలుపులు మూసేందుకు పరుగు తీసారు.

ఏముంది? మళ్ళీ ఢీ కొన్నారు. అదే స్పర్శ, అదే కంపనం, అదే ప్రశ్న, అదే పుల కరింత. రాజా వక్షస్థలానికి ఆనుకుని ఉండి పోయింది రాధ.

యిప్పుడు మాత్రం రాజా సాహసించ కుండా ఉండలేకపోయాడు. రాధను తన నుండి వేరుకానీయలేదు. ఒక చేతితో ఆమెను తన హృదయానికి అతిదగ్గరగా బంధించి రెండవ చేతితో తలుపు మూశాడు.

జీవితంలో మొదటిసారిగా పురుషుని కౌగిలిలో జరిగే అనుభవానికి రాధ దేహమంతా కంపించిపోయింది. పెదవులు కూడా వణాకు తున్నాయి. హృదయం వేగంగా కొట్టు కుంటుంది, కళ్ళు మత్తుగా మూతలు పడు తున్నాయి. కాటుక కరిగిపోతుందేమో అన్నంత వెచ్చగా ఉందామె శరీరం.

రాజా హృదయస్పందన తీవ్రంగా వినిపిస్తుందామెకి. ఆ సన్నని వెలుతురులో ఒక్కసారి రాజా ముఖంలోకి చూచింది.

ఆమెను తన బాహుపాశంలో ఇముడ్చు కున్న రాజా కళ్ళల్లో ఏదో అసంతృప్తి గోచరించిందామెకు. వేడి నిశ్వాసలతో కంపి స్తున్న అతని అధరాలు ఆమె వేపే వస్తు న్నట్లు గుర్తించింది. ఎంతో సమయ స్ఫూర్తితో తన చేతుల్లోని మధు చెక్కి టితో అతని అధరాలను మూసి తలుపు తీసుకుని బయటకు పరుగు తీసిందామె స్వేచ్ఛా హరిణంలా చినుకుల్లో తడుస్తు కుంటూ.

మధు లేలేత బుగ్గలపై ముద్దుల వర్షం కురిపిస్తూ రాజా అస్పష్టంగా ఏదో అన్నాడు బహుశః "ఎంత అదృష్టవంతుడివిరా, అమ్మను మరిపించే అమ్మను పంపించాడు దేవుడు నీకోసం" అని అయి ఉంటుంది.

గుడిగంటలు మ్రోగాయి... ●

# కమ్యూనిస్టు దేశాలలో కాం

## సచిత్ర వ్యాస శీర్షిక ప్రారంభం

ఆనందవికటన్ సౌజన్యంతో


ఆర్. వెంకట్రామన్

(మద్రాసు పరిశ్రమలమంత్రి)




వ్యాస రచయిత



భారత సోవియట్ సౌహార్ద సంఘంలో ప్రసంగిస్తున్న కాంగ్రెస్ అధ్యక్షులు కామరాజ్ గారు

పందొమ్మిది వందల అరవయ్యారవ సంవత్సరం స్వాతంత్ర్యదినం తమిళనాడు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించవలసినట్టి శ్రేష్ఠమైన దినం. చెన్నపురిలోని మీనంబాకం విమానాశ్రయం ఆనాటి వరకు చూచివుండని జనసందోహాన్ని ఆనాడే చూచింది. చెన్నపురి వీధులకు అసంఖ్యాకమైన శకటాలను (వాహనాలను) భరించే అవకాశం ఆనాడు లభించింది. కనుచూపు మేర ఎటు చూచినా సైకిళ్లు, స్కూటర్లు, కార్లు, గుర్రాలు— ఇవే కనుల పండువయాయి.

ఇవన్నీ ఎందుకోసం?

తొలిసారిగా విదేశాలకు విజయం చేసి చెన్నపురికి మరలి వచ్చిన భారతదేశ నిరుపమాన నాయకులు కామరాజ్ గారికి స్వాగత మివ్వడానికే! సోషలిస్టు దేశాలకు వెళ్లి తిరిగి వచ్చిన ప్రజానాయకులు కామరాజ్ గారికి చెన్నరాష్ట్ర ప్రజలు ఘన స్వాగత మిచ్చారు. దిక్కులు జయ జయ ధ్వానాలతో పిక్కటిల్లగా, విను వీధినుంచి పుష్పవర్షం పడుతుండగా చెన్నపురి నగర వీధులలో వూరేగింపుగా వచ్చారు భారత నాయకులు కామరాజ్ గారు.

తేనాంపేట కాంగ్రెస్ మైదానంలో జరిగిన బ్రహ్మాండమైన మహాసభలో ప్రసంగించినప్పుడు నాయకులు కామరాజ్ గారు ఇలా అన్నారు:—

"సోవియట్ రష్యాకు, తూర్పు జర్మనీ, హంగేరీ, బల్గేరియా, యుగోస్లేవియా వంటి దేశాలకు నేను వెళ్లి వచ్చాను. ఆదేశాల కన్నింటికీ వేడుకలు చూడడానికో, వూళ్లు తిరిగి చూడడానికో నేను వెళ్లలేదు. అక్కడ ప్రజలు ఎలా జీవిస్తున్నారు, ఏఏ సౌకర్యాలను ప్రజలు అన్వేషించు కుంటున్నారు, ఏఏ సౌకర్యాలను ప్రభుత్వం ప్రజలకు కలిగిస్తున్నది అని చూడడానికే వెళ్లాను."

అవును! కామరాజ్ గారు ఏదో ఉబుసు పోకకో, వినోదవిలాస యాత్ర చేద్దామనో విదేశాలకు వెళ్లలేదు. ఆ దేశాలను చూచి, ఆ దేశాల ప్రజలతో మాట్లాడి, వాటి మూలంగా మనదేశానికి, మనదేశ ప్రజ



ఆర్. వెంకటరామన్ గారితో కామరాజ్ గారు

# గ్రెస్ అధ్యక్షుడు కామరాజ్



మాస్కోలో కామరాజ్ గారు

కామరాజ్ గారు దానిని గురించి ఆలోచించి "పోదాం" అని అన్నారు. "చూద్దాం" అని అనలేదు, "పోదాం" అనే అన్నారు. ఆ దేశాల కన్నిటికీ వెళ్ళా లనే తలంపు ఆనాడే వారి మనస్సులో గట్టిగా పాతుకుంది.

అయితే, బాధ్యతలు వారిని వెళ్ళ కుండా చేస్తూ వుండేవి. ఆనాడు వారు వేసిన పథకం నెరవేరడానికి పదిహేను సంవత్సరాలు అవసర మయ్యాయి.

చరిత్రాత్మకమైన తాష్కెంట్ ఒప్పం దాన్ని రూపొందించి శాంతి పతాకను ఎగుర వేసి, ఆ మట్టిలోనే మరుగై పోయారు నెహ్రూ వారసుడయిన శాస్త్రీజీ. ఆ శాంతి దూతను మోసుకొని ఢిల్లీకి వచ్చారు రష్యా ప్రధాని కోసిగిన్. వారు మాత్రమే కాదు. ప్రపంచంలోని పలు ప్రాంతాల నుంచి కూడా పలువురు నాయకులు ఆ భారతసత్పుత్రుని అంతిమ యాత్రలో పాల్గొనడానికి ఢిల్లీకి వచ్చారు.

అలా వచ్చిన నాయకులందరూ, అప్పుడు తాత్కాలిక కేంద్ర ప్రభుత్వ ప్రధానిగావున్న నందాగారిని కలుసుకొని,

లకు ఎట్టి ప్రయోజనాలు చేకూర్చ వచ్చును అనే విషయాన్ని తెలుసుకొను డానికే వారు వెళ్ళారు.

సంపద, అభివృద్ధి పొందిన విదేశా లకు వెళ్ళాలనే అభిప్రాయం కామరాజ్ గారికి ఇప్పుడు హఠాత్తుగా కలిగినట్టిది కాదు. పదిహేను సంవత్సరాలకు ముందే వారు విదేశాలకు వెళ్ళవలసిన వారు.

వారు ముఖ్య మంత్రి బాధ్యతను స్వీకరించడానికి ముందు జరిగిన ఒక సంఘటన నాకు బాగా జ్ఞాపకం వుంది. నే నప్పుడు విదేశాలకు వెళ్ళి తిరిగి వచ్చాను. ఆ దేశాల రాజకీయ ఆర్థిక సాంఘిక వ్యవస్థలను గురించీ, వారి అభ్యుదయ ప్రణాళికలను గురించీ విద్యాభి వృద్ధిని గురించీ నాయకులైన కామరాజు గారికి నేను వివరించి చెప్పి "వీటి నన్నిటినీ మీరు వెళ్ళిచూచి రావాలి. మీరు వెళ్ళివస్తే దేశానికి ఎక్కు ప్రయోజనాలు ఏర్పడుతాయి" అని అన్నాను.



సోషలిస్టు దేశాలలో పర్యటించి తిరిగి వచ్చిన కామరాజ్ గారికి చెన్నపురి మీనంబాకం విమానాశ్రయములో ఘనస్వాగతం

అఖిల భారత కాంగ్రెస్ అధ్యక్షులు కామరాజ్ గారిని కూడా కలుసుకున్నారు. అప్పుడే ఆ నాయకులు కామరాజ్ గారిని తమ దేశాలకు విచ్చేయ వలసిందిగా ఆహ్వానించారు. అందులోను, ముఖ్యంగా సోవియట్ ప్రధాని కోసిగిన్‌గారూ, అమెరికా ఉపాధ్యక్షులు హంఫ్రీగారూ "మా దేశానికి విజయం చేయండి" అని మన నాయకులకు ఆహ్వానం అందించారు.

సామాన్యంగా, ఒకదేశం మరొక దేశం ప్రభుత్వ నిర్వాహ వర్గ నాయకులకు ఆహ్వానం అందించడమే అంతర్జాతీయ రాజకీయ సంప్రదాయం. ప్రభుత్వ నిర్వాహక వర్గంలో లేని రాజకీయ నాయకుని తమ దేశానికి విచ్చేయవలసిందిగా అమెరికా ప్రభుత్వమూ, రష్యా ప్రభుత్వమూ ఆహ్వానించడమనేది ఇదే తొలిసారి. ఈ విధంగా సంప్రదాయానికి విరుద్ధంగా నాయకులు కామరాజుగారిని ఆ దేశాలు ఎందుకు ఆహ్వానించాయి అనడానికి "ఇదే కారణం" అని కచ్చితంగా చెప్పడం సాధ్యం కాదు. కాని, దానిని కొంతవరకు వూహించవచ్చు.

నెహ్రూ తర్వాత భారతదేశంలో కల్లోలం చెలరేగి ప్రజాస్వామ్యం నశించి పోతుందనే ఒక ఉద్దేశం లోకంలో పలు భాగాలలోను వ్యాపించి వుండేది. భారతదేశ సన్నిహిత మిత్రులనబడే నాయకులలోను ఈ సందేహం ఉండేది. ఆ సందేహాన్ని పూర్తిగా పోగొట్టి, క్లిష్ట సమయంలోను విచ్ఛిన్నంకాక కలతచెందక చెదరిపోక లేచి నిలబడే శక్తి గలది భారతదేశం అనే విషయాన్ని ప్రశాంతంగా, క్రమశిక్షణ పద్ధతితో ఏకగ్రీవంగా ఒక నాయకుని ఎన్నుకొని మనం నిరూపించాము. ఆ విధంగా ఒక ఆశ్చర్యకరమైన విషయాన్ని నిర్దుష్టంగా నిరూపించినవారు నాయకులు కామరాజు గారే నన్నది ప్రపంచ మెరిగిన సత్యం. ఈ దేశంలో ప్రజాస్వామ్యం అడ్డము, ఆటక లేకుండా కొనసాగగలదు అన్నదానిని ప్రపంచానికి ఎత్తి చాటారు కామరాజు గారు. ఆ విధంగానే శాస్త్రీజీ మరుగయి నందువల్ల ఏర్పడిన క్లిష్ట పరిస్థితి గట్టెక్కించడానికి ఈ దేశ ప్రజలు మాత్రమే కాదు ప్రపంచ నాయకులు గూడ కామరాజు గారినే ఎదురు చూస్తూ వుండిపోయారు. ఆ సమయాన ఢిల్లీలో

# కామరాజ్

వున్నందువల్ల ప్రపథమంగా కళ్ళన్నీ కామరాజుగారిని ఎంత ఆతురతతో చూచాయి అన్నది నాకు బాగా తెలుసు.

భారతదేశం విడుదలకు కాంగ్రెస్ సంస్థే మూలకారణ మయింది. అంతే, విడుదల పొందిన భారతదేశాన్ని కాపాడ వలసిన మహత్తర బాధ్యత గూడ, కాంగ్రెస్‌నే ఆశ్రయించింది. ప్రశాంతంగా క్రమశిక్షణ యుతమైన పద్ధతిలో దేశానికి ప్రగతిని, పురోగతిని కలిగించవలసిన బాధ్యత కాంగ్రెసుదే అన్న విషయాన్ని ప్రజలు గ్రహించారు. ఈ కారణంవల్లనే, కామరాజు గారి నాయకత్వం ఇతర ప్రజాస్వామ్యదేశాల నాయకత్వానికి కొంచెం విలక్షణంగానే వుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతిలో నడిచే తక్కిన దేశాలలో బాధ్యతలన్నీ పార్లమెంటరీ పార్టీ సభ్యులకే ఎక్కువ. కాని, భారతదేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య పద్ధతి సక్రమంగా నడవడానికి కాంగ్రెసే బాధ్యత వహిస్తున్నది. పార్టీ నాయకులను ఎన్నుకోడం, మంత్రి వర్గాన్ని ఏర్పాటుచేయడం, శాసన సభలకు సభ్యులను నిర్ణయించడం మొదలయిన ఆ సకలమూ కాంగ్రెస్ సంస్థే చేస్తూ వస్తున్నది. ఆ మహత్తర సంస్థ అధ్యక్షులు తమ దేశానికి విచ్చేయాలని ఇతర దేశాల నాయకులూ, అధిపతులూ వాంఛించడం సహజమే గదా!

రష్యా ప్రధాని కోసిగిన్‌గారు ఢిల్లీలో కామరాజు గారిని కలుసుకొని తమ దేశానికి రావలసిందని ఆహ్వానించినప్పుడు కామరాజు గారు ఆ ఆహ్వానాన్ని స్వీకరించారు. వారు నన్ను కలుసుకున్నప్పుడు, తాము ఆ ఆహ్వానాన్ని అంగీకరించడం గురించి నాకు తెలిపి, మే నెల చివర వెళ్ళ వచ్చునని తెలిపారు. మే చివరన జూలై నెలలో వెళ్ళడమని నిశ్చయ మయింది.

కామరాజు గారి విదేశ ప్రయాణంలో ఎదురైన తొలి సమస్య వారి ఉడుపుల (దుస్తుల) సమస్యే. కామరాజు గారు ఏ దుస్తులతో వెళ్ళడం అనేదే అందరికీ సమస్య అయింది.

"రష్యాలో చలి చాల ఎక్కువ. అంతే, కోటు, పాంటు వేసుకొనే వెళ్ళాలి."

"ఓవర్ కోట్ లేకుండా అక్కడికి వెళ్ళడమా? అది ఎలా సాధ్యం?"

"ఉన్ని దుస్తులు ఎక్కువగా తీసుకుని వెళ్ళాలి వారు."

ఇలా మిత్రులందరూ విధవిధాలైన సలహాలు ఇవ్వడం ఆరంభించారు.

అయితే, ఈ దుస్తుల విషయం కామరాజు గారికి సంబంధించినంతవరకు సమస్యే కాదు. తాము అలవాటుగా ధరించే పంచ, చొక్కాలతోనే వెళ్ళడమని నిశ్చయించు కున్నారు. ఇది పలువురికి పెద్ద అద్భుతంగా కనిపించింది.

అయితే, నాకు సంబంధించినంతవరకు దీనిలో అద్భుత పడవలసిన దేమీ లేదు. వారిని బాగా ఎరిగిన వారికి దీనిలో ఆశ్చర్యపడడానికి అవకాశం లేనేలేదు.

తమిళనాడు కాంగ్రెస్ సంఘం అధ్యక్షులుగా వున్న కామరాజుగారు తమిళనాడు ముఖ్యమంత్రి అయినప్పుడు పలువురు వారిలో మార్పులు ఎదురు చూచారు.

"ఇక కామరాజ్ ప్రభుత్వ భవనానికి పోతారు. సరికొత్త కారు పెట్టుకుంటారు. దుస్తులలోను ఏదైనా మార్పు వుంటుంది." అని పెక్కు మంది అనుకున్నారు. కాని, వారు దేనిని మార్చలేదు. ముఖ్య మంత్రి అయిన తర్వాత గూడ ఎప్పటిలాగ తాము నివసించే తిరుమలై పిళ్ళై వీధిలోని ఇంటిలోనే వున్నారు. అంతకు ముందు తాము వాడే కారునే వాడారు. చొక్కా మారలేదు, పంచ మారలేదు. తువ్వాలు కూడ మారలేదు.

కామరాజ్ గారు తమ తలంపులో ఏ విధమైన మార్పునూ ఇష్టపడలేదు. వారి ఇష్టమంతా ఈ దేశ ప్రజల జీవన ప్రమాణం ఎక్కువ కావాలి అన్నదే. తమ పరిస్థితిలో మార్పు అవసరంలేదు. తమ దేశ ప్రజల పరిస్థితిలో మార్పు అవసరం అన్నదే ఆ నాయకుని లక్ష్యం.

అలవాటుగా తాము ధరించే ఉడుపులతోనే రౌండ్ టేబిల్ మహాసభకు గాంధిజీ వెళ్ళారు. ఆటు తర్వాత ఆ పద్ధతిలో విదేశాలకు వెళ్ళిన నాయకులు కామరాజ్ గారే.

సాధారణంగా విదేశాలకు వెళ్ళేవారికి రకరకాల సమస్యలు పుడయింది, ఒక విధమైన అశాంతి నెలకొంటుంది. అన్ని విషయాలలోను విడివిడిగా చింత, ఆతురత

ఏర్పడుతాయి. కాని, కామరాజ్ గారితో ఇవేవీ కలుగలేదు. వారికి సంబంధించి నంతవరకు మద్రాసు నుంచి మదురైకు పయనం కావడం ఎంత సామాన్య విష యమో, అంత సామాన్యమే మాస్కో పయనం కూడా. "అన్నీ మీరు చూచు కోండి." అని నాతో చెప్పి, వేడుకలు చూచుకోడం ప్రారంభించారు వారు.

మాస్కో వెళ్లడానికి ముందురోజు ఢిల్లీలో ఒక విందు ఏర్పాటు చేయబడి వుండినది. విందు చేసినవారు భారత దేశంలో రష్యా రాయబారి. దానికి యుగో స్లేవియా, బల్గేరియా, చెకోస్లోవాకియా హంగేరీ, పశ్చిమ జర్మనీ మొదలయిన దేశాల రాయబారులూ ఆహూతులయారు.

ఆ విందులో రష్యా రాయబారి నాతో "కామరాజ్ గారికి విశేషాభిరుచి ఏదైనా వుందా? ఫలానా వినోదకాలక్షేపం, ఏదైనా వారికి ఇష్టమా? రష్యాలో మేము ఏర్పాటు చేసినవికాక, వారు మరేదైనా చూడడానికి ఇష్టపడుతున్నారా?" అని అడిగారు.

వారు ఈ విధంగా అడగడానికి కారణం వుంది. సాధారణంగా విదేశాల నాయకులు విచ్చేసేటప్పుడు, తమ పర్యటన కార్య క్రమంలో తమ తమకు విశేషంగా ఇష్ట మైన అంశాలు చేరుస్తారు. పర్యటన చేసే నాయకుల 'హాబీ'కి కార్యక్రమంలో స్థానం వుంది.

నేను ఆలోచించి చూచాను. "కామ రాజ్ గారికి ఏమిటి హాబీ? కనుక్కోడం నాకు సాధ్యంకాలేదు. వారి పొద్దంతా ప్రజలను గురించిన యోచనలతోనే గడచి పోతున్నది. అంటే, ప్రజల నుంచి మనుగడే వారి వినోదకాలక్షేపం" అని సమాధాన మిచ్చాను. రష్యా రాయబారి ఆశ్చర్య పడ్డారు.

"వ్యవసాయం, వృత్తులువంటి రంగా లలో పాటుపడె ప్రజలే వారి ప్రత్యేక శ్రద్ధకు అర్హులు. అంటే, మీదేశం లోని సామాన్య ప్రజలను కలుసుకోడంతో వారికి అభిరుచి వుంది. వారే వారి విశేష శ్రద్ధకు అర్హులు. అందువల్ల ఆ అవకాశాలు ఏర్పాటు చేయండి. మా ప్రజానాయకుడు మీ దేశ ప్రజలను కలుసుకొనడానికి ఏర్పాట్లు చేయించండి" అన్నాను.

రష్యా రాయబారితో నేను ఇలా చెప్పడం [illegible]. అయితే, మేము

# కామరాజ్

మాస్కోలో దిగినప్పుడు, మాకు స్వాగత మిచ్చి మాకు తోడుగావున్న సుప్రీం సోవియట్ అధ్యక్షుడు స్పిరిదినోవ్‌గారు కామరాజ్ గారిని చూచి, "మీ హాబీ ఏమిటో మాకు తెలుసు. ప్రజల శ్రేయస్సే కదా?" అన్నారు నవ్వుతూ.

ఈ ఒక్క దృష్టాంతమే, కామరాజ్ గారి పర్యటనను ఏర్పాటు చేసిన వారు, దానిలో ఎంత శ్రద్ధ తీసుకున్నారన్న దానిని ఎత్తి చూపడానికి చాలు! రష్యా రాయబారి ఢిల్లీలో నాతో ముందురోజు మాట్లాడిన విషయం వెంటనే మాస్కోకు తెలియ జేశారు. అతిథి సత్కారానికి ఎంతటి ఉత్తమమైన తార్కాణ మిది!

జూలై 22 వ తేదీ ఢిల్లీ విమా నాశ్రయం ఉత్సవ కోలాహలంతో నిండి పోయింది. చెప్పలేనంత జన సముదాయం. అధ్యక్షులు విమానాశ్రయానికి రాగానే, జనం ఆయనను చుట్టుకుని "జిందా బాద్" నినాదాలు చేశారు. పూల మాలలు పడి పర్వతాలలాగా పెరిగి పోయాయి. ఈ తొక్కిడిలో తమకు వీడ్కోలు ఇవ్వడానికి వచ్చిన విదేశ రాయ బారులను కామరాజు కలుసుకొనడం సాధ్యం కాలేదు. భారత ప్రముఖులు, విదేశ ప్రముఖులు వారిని సమీపించడం సాధ్యంకాక దూరంగా నిలబడ్డారు. వారందరినీ చూడకుండానే పోవలసి వస్తుం దేమోనన్న భయం ఏర్పడింది. అయితే, మంచి వేళావిశేషం! విమానం కొంచెం సేపు ఆలస్యంగా బయలుదేరుతుందనే ప్రకటన కామరాజుగారిని వి.ఐ.పి. ల (అత్యంత ప్రముఖుల) గదికి చేర్చింది. అక్కడ ప్రముఖులను కలుసుకున్నారు కామరాజు గారు.

కేంద్ర ప్రభుత్వ మంత్రులు స్వరణ్ సింగ్, పాటిల్, నందా, జగజీవన్‌రామ్, సుబ్రమణ్యం, అశోక్ మెహతా, రష్యాలో మాజీ భారతరాయబారి కే.పి.ఎస్.మీనన్, కామరాజు గారు పర్యటించే సోషలిస్టు దేశాల రాయబారులందరూ వచ్చి వారికి వీడ్కోలు ఇచ్చారు.

ఎయిర్ ఇండియా బోయింగ్ విమానం అధ్యక్షులను, మమ్ములను ఎక్కించుకొని పాలం విమానాశ్రయం నుంచి నాలుగు వేల మైళ్లకు ఆవలవున్న మాస్కో నగరం వైపు బయలు దేరింది. వేగంగా వెళ్లి ఆ విమానం ఆ [illegible] వెళ్ల డానికి ఆరున్నర గంటలు పడుతుంది. పది గంటలకు బయలు దేరిన విమానం నిజానికి నాలుగున్నర గంటలకే మాస్కో చేరాలి. కాని, ఒకటిన్నుమ్పావు గంటలకే మేము మాస్కో చేరాము. పశ్చిమానికి పోను పోను వేయి మైళ్లకు ఒక గంట అన్న లెక్కలో కాలమానం తగ్గిపోతు న్నదే! మాస్కోకు, ఢిల్లీకి కాలమానంలో రెండున్నర గంటల వ్యత్యాసం వుంది కదూ!

రష్యాకు విచ్చేసే మన నాయకులు కామ రాజుగారికి ఏ విధమైన స్వాగతం ఇవ్వాలి, వారికి ఎవరు స్వాగతం చెప్పాలి—అని మన అధికార వర్గాలలో కల్లోలం ఏర్పడి నట్టు నేను విన్నాను. ఎందుకంటే, పదవిలేని మహానాయకులొకరు రష్యాకు దయచేయడం ఇదే మొదటిసారట. అంత ర్జాతీయ సంబంధాలలో సంప్రదాయానికి చాల ముఖ్యమైన ఒకస్థానం వుంది. ఆ సంప్రదాయ పద్ధతులకు భంగం ఏదైనా కలిగితే, అది దేశానికే అవ మానంగా, భంగపాటుగా భావించబడు తుంది.

కామరాజుగారికి మాస్కో విమానాశ్ర యంలో సుప్రీం సోవియట్ అధ్యక్షుడు స్పిరిదినోవ్‌గారూ, విదేశాంగ వ్యవహార శాఖ ప్రతినిధులూ, విదేశ సాంస్కృతిక సంబంధ సంఘాల ప్రతినిధులూ స్వాగత మిచ్చారు. శ్రీ స్పిరిదినోవ్‌గారు కామరాజు గారికి స్వాగతం చెప్పినవిమిషం నుంచి వారు మాస్కో వదలి వెళ్లేవరకు వెంబడే వుండి గౌరవించారు, ఉపచరించారు.

ఒక్కొక్క దేశంలోను విదేశాలనుంచి వచ్చే రాజకీయ నాయకుల స్థాయిని బట్టి మర్యాదలు, స్వాగత సత్కారాలు మొదలయినవి జరుపడానికి విధులు — నియమ నిబంధనలు— ఉంటాయి. వారు బసచేయడానికి స్థలాలు గూడ నిర్ణయించ బడి వుంటాయి. రష్యాలోను అలాటి మేడలున్నాయి. వాటిలో ఒక్కటి "లెనిన్ గుట్ట" అని వ్యవహరించబడే ప్రాంతంలో వున్న ఒక సుందరమైన అతిథిగృహం. మాకోసం ఆ 55 వ సంఖ్యగల మేడ ప్రత్యే కించబడింది. అధ్యక్షులు కామరాజుగారూ, మేమూ ఆ మేడ చేరాము. (సశేషం)

— అనువాదం: తి. రా.

**సీరియల్:**




### జరిగిన కథ

మగధరాజు బింబిసారుడు ఆమ్రపాలిని చేపట్టాలనే ఉద్దేశ్యంతో వైశాలికి వస్తాడు. పాలి భవనంలో ప్రవేశించి ఆమెని ఆకర్షిస్తాడు. పాలికి బింబిసారునిపై ప్రేమ జనిస్తుంది. మహానాముడు ప్రవేణి పుస్తకాన్ననుసరించి పాలిని దేశనర్తకిని చేస్తాడు. బింబిసారుని వివాహం చేసుకున్న పాలికి తన తండ్రి నిర్ణయం తెలిసి మరణశయ్యమీద ఉన్న మహానాముని చెంతకు వస్తుంది. మహానాముడు మరణిస్తాడు. అతని ఆదేశానుసారం సంథాగారంలో నృత్యంచేసి అనంతరం స్మశానవాటికకు వెళ్లి తండ్రిని స్మరిస్తుంది. పాలిని స్మరించి బింబిసారుడు మాత్సర్యపూరితుడౌతున్నాడు. పాలి కోసం అనేకదేశాలవారు పడిగాపులు పడుతున్నారు. ఇరు రష్ట్రాలమధ్య సఖ్యతకోసం పాలి సహాయాన్ని అర్థించాడు సంజయుడు.

## 19

మొదట సంజయుడు విస్మితుడయ్యాడు. కాని క్రమంగా అతనికి సత్యమంతా స్పష్టంగా కన్పడసాగింది. నిజానికి మౌనంగా ఉండి సహించినా, పాలి కష్టం సహింపరానిది.. అతడు పాలికి నమస్కరించి అన్నాడు—'దేవీ, మీకు ఉపదేశం చేయడానికిగాని, బోధింపడానికిగాని నాకు యోగ్యతలేదు. మీ ఆత్మ త్యాగం అద్భుతం. మీ సహనం ఆశ్చర్యకరం. మహాకార్యాలను నిమిత్తంగా చేసి ప్రకృతి మిమ్మల్ని పృధివికి పంపింది. ఆ కార్యముల ముందు మీ విషయం చెప్పుకోడం మీవంటి మహాత్మురాండ్రకు అత్యంత సామాన్య విషయం. నేను వెళ్లడాని కనుమతిస్తారా?'

పాలి తల పైకెత్తింది. సంజయుడు తన గుప్తవేషం ధరించాడు. అతడు నమస్కరించి వెలపలికి పోసాగాడు. పాలి కన్నీరు తుడుచుకుంది. ఆమె తన ప్రియతమునకు అత్యంత సన్నిహిత మిత్రుడు పోతూండడం చూస్తోంది.

మరునాడు ఆమ్రపాలి లిచ్ఛవీయ రాజా చేటకి కుమార్తె చేలనను కలుసుకోగానే ఆమెను చూచి చేలన చాల ఆశ్చర్యపడింది. ఎందుకంటే, ఏడు రోజులకు ముందే ఆమె పాలిని ఆదరపూర్వకంగా ఆహ్వానింపగా ఆమె రావడానికి తన అసమర్థతను వెల్లడించింది.

పాలిని చూడగానే చేలనకు ఆనందం కలిగింది. ఆమె పాలి ప్రతిభ చేత ప్రభావితురాలైంది. పాలి అక్కడ అయిదురోజులుంది. ఈ అయిదు దినాలలో ఆమె చేలనను ఎంతో యోగ్యురాలినిగా చేసింది. దానితో ఆమె మనసు అనుపమ సుందరియైన ఆమ్రపాలిని తిరస్కరించు బింబిసారుణ్ణి ద్రవింపచేయగోరింది. మరో వైపున సంజయుడు కూడా బింబిసారుని మనసు చేలన వైపు ఆకర్షింప చేస్తున్నాడు.

...ఒకనాడు బింబిసారుడూ, చేలనా అతిరహస్యంగా కలుసుకున్నారు. బింబిసారుని హృదయపటం మీద చేలన అమితమైన ఛవి అంకితమైంది. చేలన హృదయం కూడ బింబిసారుని ఛవి దర్శనమందు మునిగింది. ఆమెలో సౌందర్యం కంటె బుద్ధి అధికంగా ఉంది. కాబట్టి బింబిసారుని ముగ్ధుని చేయడానికి ఆమెకెక్కువ కాలం పట్టలేదు. క్రమంగా వాళ్ల రహస్య కలయికల సంఖ్య శీఘ్రంగా పెరుగుతూ పోయింది. హృదయంలో ప్రేమ భావమూ గంభీరం కాజొచ్చింది.

తల్లి అభ్యంతరం చెప్పింది. తండ్రి నచ్చచెప్పాడు. కాని, చేలన ఏ రాజకుమారుని తోనూ వివాహం చేసుకోడానికి సిద్ధపడలేదు. ఆమె మనసు బింబిసారునితో ఉన్నట్లు తల్లిదండ్రులకు ఎలా తెలుస్తుంది? తుదకు చేటక రాజు తన మిగిలిన ఇరువురి పుత్రికలతో పాటే చేలన వివాహం చేయడానికి నిశ్చయించాడు చేలనకు వ్యాకులం హెచ్చింది.

చాల దినముల నుండి ఆమె బింబిసారుని కలియనూలేదు. క్రమంగా వివాహదినం సమీపించింది.

ఒకరాత్రి అందరూ నిద్రలో మునిగి ఉండగా బింబిసారు డామె శయనగృహానికి వచ్చాడు. చూడగానే చేలన రక్తం శుష్కించింది. వైశాలిలోని ముఖ్య లిచ్ఛవీయ నాయకులతో చేటకరాజునకు విరోధం. లిచ్ఛవీయుల శతాబ్దాల నాటి ప్రాచీన సంప్రదాయాన్ని ఉల్లంఘించి అతడు తన తనయుల వివాహాలు వజ్జిభూమికి వెలపలి మహారాజులతో చేశాడు. అలా చేస్తున్నప్పటికీ అతడు లిచ్ఛవీయుడే. మగధ విరోధం అతని మనస్సులో కూడా ఎక్కువ బలంగా ఉంది. బింబిసారుని తన రాజ్యానికి సరిహద్దులో అయినా చూస్తే చేటక రాజు తన్ని విడువజాలడని చేలన ఎరుగును. ఆమె విస్మితయై బింబిసారు డక్కడికి ఎలా రాగలిగెనా అని చూస్తోంది.

బింబిసారుడు ఆమె మనసులోని మాట గ్రహించాడు. అతడు నవ్వుతూ ఆమె కేలు బట్టి భవనము నందొక మూలకు తీసుకొని పోయాడు. భూమియందు త్రవ్వబడిన ఒక గోతి దగ్గర కిరువురు చేరారు. బింబిసారుడు ఆ వైపు సంకేతం చేసి అన్నాడు 'ఈ సొరంగాన్ని మగధదేశం నుండి ఇక్కడి వరకూ నాగాధ్యక్షచారులు సిద్ధం చేశారు. నేను చేటకరాజును బాగా ఎరుగుదును. అతడు నాకు లోబడినట్టే, విరోధులైనట్టి అనేక రాజుల దగ్గరికి సంతోషంతో తన కన్యలను పంపాడు, పంపుతున్నాడు. కాని తన ఒక తనయ కోరికను అతడు మట్టుపెడుతున్నాడు. నేను నా హృదయేశ్వరిని గ్రహింపక విడువనని అత డెరగడు. కాబట్టే నేనీ మార్గాన్ని కనుక్కున్నాను.'

'కాని, దీని నెప్పటినుండి తయారు చేస్తున్నారు?'

'మన ప్రథమ సమాగమం అయినప్పటి నుండి.'

'తుదకు దొంగతనంగానే తీసుకుపోవడానికి యత్నించారు కదా?'

'అవును, నా ప్రియురాలి తండ్రి నాకూ పితృతుల్యుడే, ఏ మాగధీయ రాజు మాత కూడ జనకు నాజ్ఞను ఉల్లంఘించడం తన కుమారునికి నేర్పదు. అటువంటప్పుడు నాకు గత్యంతరం ఏముంది? నేను నీ తండ్రి ఎదుట శస్త్రం ఎత్తలేను..'

'అయితే?'

'నా మహామంత్రి బ్రాహ్మడు. వివాహ



దినమందే శుభముహూర్తం ఉంటుందని అతడు చెప్పాడు. ఆనాటి ఉదయం నేను నా రాణిని ఈ మార్గం గూడా తీసుకు పోతాను..'

'అంటే నేటికి అయిదవరోజునా?'

'అవును, అయిదోనాడు', ఇట్లని బింబిసారుడు చేలనను తనవైపునకు లాక్కున్నాడు. ఆమె క్రీగంటితో అతన్ని చూస్తోంది.

సరిగ్గా ఆ సమయానికే నగరాని కలాగే కొంచెం దూరంగా ఒక నిర్జన భవనంలో పాలి తనకై హృదయాన్ని అర్పించు చాటకరాజుకు నచ్చచెప్తోంది.

'సత్యం అని నమ్ము, మహారాజా, మీరు బింబిసారుని మాట అంగీకరించకపోతే, అతని సేన వచ్చి చేలనా కుమారిని తీసుకుపోతుంది. చేలన మీ తనయే అయినా, హృదయం చేత వివాహితయైన కన్యను అడ్డగించకూడదు. అపయశం చేత ప్రాప్తించిన ఓటమిని స్వీకరించడం కంటె మీరు ఒక్కసారిగా యశస్సమ్మానాలను ఎందుకు స్వీకరించరు?' ఇలా అని పాలి మదిరతో నిండిన పాత్రను చేటకరాజు నోట ఒంపింది. చేటకరాజు త్రాగుతూ అన్నాడు 'అతడు చేలనను తీసుకుపోగలడని నీకెలా తెలుసుకున్నావు?' స్త్రీ భక్తుడైన రాజుకు ఒక చెంప పెట్టు పెట్టి సురంగం అతని మహలు దాకా త్రవ్వబడిందనీ, దాన్ని త్రవ్వ నిశ్చయించినది బింబిసారుని మంత్రి అనీ, మంత్రికి సురంగ మార్గం చూపించేది స్వయంగా తానని చెప్పాలని పాలికి ఇచ్ఛ కలిగింది. కాని, సురంగ విషయంలో బింబిసారుడు స్వయంగా ఎంత అనభిజ్ఞుడో చాటకరాజు కూడ అంత అనభిజ్ఞుడుగ ఉండాలని పాలి కోరిక. అతనికి శంక కలగకుండా పాలి ప్రసంగం మార్చింది.

'మహారాజా, నేను నర్తకిని, లిచ్ఛవీయ నర్తకిని'

'కాదు, నా నర్తకివి.'

'అవును, మహారాజా, మీ దయవల్ల దేశ విదేశాల నుండి ఎందరో రాజ దూతలు నృత్యసంగీతాలు ఆనందించడానికి నా దగ్గరకు వస్తూంటారు. కాని నిన్న నేను విన్న భయంకర సమాచారాన్ని శీఘ్రాతి శీఘ్రంగా మీకు తెలియజేయడానికి నేనిక్కడికి వచ్చాను. కేవలం రెండురోజులలో మీరు, వజ్జీయులు, లిచ్ఛవీయులు, స్నేహితులు— అందరినీ సహాయం కోసం పిలవలేరు. దాదాపు సగంమంది లిచ్ఛవీయులు మీకు సాయపడరు. అక్కడ బింబిసారుడు ఒక్క స్త్రీకోసం తన సేననంతా తీసుకొని మిథిలపై దండెత్తుతాడు.'

నిషాళించి కొంచెం తెలివి పొంది చేటకరాజు కళ్ళు మిలమిల లాడించాడు. 'ఒక్క స్త్రీ కోసమా?'

'ఎందుకు కాకూడదు మహారాజా? మీరు నా కోరకింత రాత్రి వేళ రాజమహలు విడిచి ఒక యోజన దూరం కలుసుకోడానికి రాలేదా? ఒకరాజు ఒక నర్తకి కోసం ఒక యోజన దూరం రాగలిగినప్పుడు మరో రాజు తన భార్యకై ఏబది యోజనాలైనా పోలేడా?'...

చేటకరాజు మద్యపాత్ర చేతిలోకి తీసుకొని పాలిని చూడసాగాడు.

చేటకరాజు ఉదారచిత్తుడు. తెలివిగలవాడు. స్త్రీ కోసం ఇంత దౌర్బల్యం అతనిలో లేకపోతే లిచ్ఛవీయులే అనేమిటి సమస్త వజ్జీయులకూ ప్రభువగు సామర్థ్యం అతనికుంది. అతడొక్కడే ప్రకటంగా లిచ్ఛవీయులకు విద్రోహం చేయగలడు. పాలి చేటకరాజు మనస్సులో మాట తెలుసుకొంది.

ఆమె అతనికి చాల దగ్గరగా వచ్చి కూర్చుని మిక్కిలి నేర్పుతో అతనికి బోధించసాగింది. చేటకరాజు ఆమె నృత్యం కంటె ఆమె చాతుర్యానికి అధికంగా ముగ్ధుడయ్యాడు.

పాలి ఆ మాటలన్నింటినీ అతడంగీకరించాడు. అయినా ప్రకటంగా అతడు బింబి

# ఆమ్రపాలి

సారునకు లొంగిపోడానికి గాని, అతన్ని అల్లునిగా చేసుకోడానికిగాని సిద్ధపడలేదు. పాలి మిక్కిలి సూక్ష్మదృష్టితో చేటక రాజును చూస్తోంది. పైకి రాకుండా, చేటక రాజు మనస్సులోనే కలత పడు ఈ కోరికను ఆమె గ్రహించింది.

అయిదవ నాటి ఉదయం రాజమహలులో వివిధ వాద్యాలు మ్రోగుతున్నాయి. మహారాజ చేటకరాజు అన్య రాజాధి రాజులను సత్కరించడంలో నిమగ్నుడయ్యాడు. అప్పుడే ఆకస్మికంగా రాణి అరుస్తూ అతని దగ్గరకు వచ్చింది. చాల కలత చెందడం వల్ల ఆమె స్పష్టంగా మాట్లాడలేక పోయింది. కాని, ఆమె చెప్పదలచిన దాని భావమేమంటే, చేలన అక్కడి నుండి అదృశ్యమైందని.

చేటక రాజంతా విడిచిపెట్టి చేలన శయనగృహానికి వెళ్ళాడు. ఒక దాసి ఒక్కసారిగా సురంగ ద్వారాన్ని చూసింది. ఆమె భయపడుతూ మహారాజున కది చెప్పింది. చేటక రాజు భార్యను, విశిష్టులైన యోధులను వెంటబెట్టుకొని సురంగంలో దిగాడు.

సురంగానికి రెండవ కొనను చేరగానే మరొక రాజ్యంలోకి వచ్చినట్లు వాళ్ళకు తెలిసింది. ఇద్దరూ చేలనను చూశారు. కాని చేలన ఒంటరిగాలేదు. ఆమె వెంట బింబిసారుడన్నాడు. వాళ్ళ వివాహం ఇప్పుడే ముగిసింది.

చేటకరాజు తలవంచుకున్నాడు. చేలనా బింబిసారులు వాళ్ళ కెదురుగా కూర్చుని ఆశీర్వదించండని కోరారు. చేటకరాజూ, పత్నీ మౌనంతో ఆశీర్వదించారు. మాగధీయ భూమి మీద అధికంగా ఉండలేని కారణం వల్ల వాళ్ళిద్దరూ మళ్ళీ సురంగంలో అదృశ్యులయ్యారు. చేలన అశ్రుపూరిత నేత్రాలతో తల్లిదండ్రులు వెడుతూంటే చూస్తోంది.

చేటకరాజు కింకర్తవ్య విమూఢునిలాగ సురంగంలో నడుస్తున్నాడు. ఇన్ని ఘటనలు ఒక్కసారిగా ఎలా అయ్యాయని అతడాలోచిస్తున్నాడు. పాలి మాటలుపూర్తిగ సత్యమని అతనికి తెలిసింది. అతనికి తనపైనే కోపం వచ్చింది. తన లజ్జితవదనం చూపడం కంటె ఎక్కడికైనా వెళ్ళిపోడం మంచిదని అతడు నడుస్తున్నప్పుడాలోచిస్తున్నాడు.

ఆవేశంలో రాణి వేగంగా పోతోంది.. చేటకరాజూ అలాగే ఆమె వెంటపోతున్నాడు. అతడు తన ఖడ్గం, కటారు మొదలైన శాస్త్రాస్త్రాలన్నింటినీ ఒక్కటొక్కటిగా తీసి విసిరివేశాడు. అతని కర్ణాలు బధిరాలవుతున్నాయి. ఆవేశం వల్ల అతని వక్షంలోని రక్తం ఉప్పొంగుతోంది. చివరకతడు చేలన భవనానికి వచ్చాడు.

సురంగం చివరి నుండి చేటకరాజు మొదట వెలువడ్డాడు. పైకి రాగానే అతని ముఖాకృతి అకస్మాత్తుగా మారిపోయింది. మృతుడయ్యాక జీవి అవుతున్నట్లు, అంధుడయ్యాక కళ్ళు లభిస్తున్నాయో అన్నట్లు అతనికి పరమానందం కలుగుతోంది..

మహారాణి సురంగం నుండి వెలువడింది. ఆమె మహారాజులోని ఈ మార్పు విస్మితయై చూస్తోంది.

రాజునకు, రాణికి ఎదుట గంభీరవదనంతో వైశాలీ నర్తకి ఆమ్రపాలి నిల్చుంది. ఆమె ఇద్దరికీ నమస్కరించింది. రాజామె దగ్గరకు వచ్చి ఆవేశంతో అన్నాడు—

'పాలీ, నీ వంగీకరిస్తావా? నేను సురంగం నుండి వెలుపలికి రాగానే ఒక నిశ్చయం చేశాను.'

పాలి మునుపటి లాగే గంభీరవదనంతో 'నేనెరుగుదును' అని జవాబిచ్చింది.

'నీ వెరుగుదువా? ఏమిటి?'

'మగధరాజును చంపివేయాలనే నిశ్చయం.'

'ఆఁ పాలీ..' చేటకరాజు విస్ఫారిత నేత్రాలతో ఆమెను చూడసాగాడు. ఆమె ఇతరుల మనస్సులలోని తర్కవితర్కాలను కూడా ఎరుగును.'

'నేను, లిచ్ఛవీయును, రాజా!' అని పాలి మందహాసం చేసి ఒక గొప్ప విషయం చెప్పింది—'మీరూ లిచ్ఛవీయులే. నేను మిమ్మల్ని గుర్తింపలేనా?'

'నిన్ను చూచి నాకొక విధమైన శాంతి లభిస్తోంది, పాలీ.'

'ఇందుచేతనే నేనిక్కడికి వచ్చాను.'

రాణి వెనకనే నిలబడింది. పాలి చతుర నేత్రాలు ఆమె మనస్సులోని విషయాన్ని తెలుసుకున్నాయి. నవ్వుతూ ఆమె అంది— 'మహారాజా, ఏకాంతంగా పోదాం. నేను మిమ్మల్నీ, మహారాణినీ కొంత ప్రార్థించాలి మీరు దానికి సంతుష్టులై దాని ప్రకారం చేస్తే నేను ధన్యురాల్ని అవుతాను.' ఇలా

అని పాలి చేటకరాజును, మహారాణిని మరో భవనానికి తీసుకుపోయింది. ఆమె తక్కిన వాళ్లందరినీ అక్కడనుండి వెళ్లిపొమ్మని ఆజ్ఞాపించింది. అప్పుడామె రహస్యంగా వారిద్దరికీ తానాలోచించిన నూతన మార్గం బోధింపసాగింది.

* * *

నగరశ్రేష్ఠి ప్రాహసం దిగజారుతోంది. నేడు వైశాలీ సంథాగారంలో భీషణ కోలాహలం అవుతోంది. యువక లిచ్ఛవీయుల హుంకారాలు, శస్త్రాల ఖంగు, గుర్రాల సకిలింత అక్కడి వాతావరణాన్ని రణక్షేత్రంలా ఉగ్రంగాచేసి వేసింది. పూర్వంలాగ అనుశాసనా భావమున్నా, అభయుని మరణానంతరం అనేకమంది రాజుల మనస్సుల్లో స్వతంత్రాధికారం స్థాపించు కోరిక మొలకెత్తింది. ఆజ్ఞాపాలన మింకా అడుగంటలేదు. స్వాతంత్ర్య ప్రియులైన లిచ్ఛవీయుల శౌర్యోత్సాహాలు మునుపటి కంటె కొంచెమైనా లోపించకపోయినా, సంథాగారంలో సభాసదుల నందరినీ ఒక్కసారిగ ఒక ఛత్రం కింద నిలుపరించగల వీర లిచ్ఛవీయ సభాపతి కొరవడిపట్టుంది. పలుగురైదురుగురు శక్తిశాలురైన రాజులు సంథాగారంలో తమ అధికారాన్ని నెలకొల్పడానికి ఆయత్తపడుతున్నారు. ఇట్టి స్థితిలో గౌరవంతో పూర్వీకుల ఆచారాన్ని పాటించు ఒక వృద్ధ నగరశ్రేష్ఠికి సభాపతి పదవి లభించడం మిక్కిలి స్వాభావికం. కాని ఇప్పుడీ ప్రజల నందరినీ ఒకే మార్గంలో తీసుకుపోవడం నగర

# ఆమ్రపాలి

శ్రేష్ఠి శక్తికి మించిన విషయం.

సంథాగారంలోనే ఒక లిచ్ఛవీయ అధికారి చేటకరాజు లిచ్ఛవీయ సంథాగారాన్ని అవహేళన చేశాడు. అతడు ఒకరితోకాకుండా ముగ్గురు విదేశ రాజులతో తన పుత్రికలకు వివాహం చేశాడు. ఇంతేకాదు, ఈసారి అతడు వైశాలీ లిచ్ఛవీయుల ఘోరశత్రువైన బింబిసారునితో ఒక కన్యకు వివాహం చేసి వాళ్ల కోపాన్ని ఇనుమడింప చేశాడు. నేడు పరిషత్తు జరగడానికిదే కారణం. ఇందువల్లనే ప్రతి లిచ్ఛవీయుని రక్తం ఉడికింది. తన పదవి మహత్వాన్ని గ్రహించి నగరశ్రేష్ఠి తన కంగారును, కాళ్ళ వణకును కష్టంతో కప్పిపుచ్చుతూ అందరినీ శాంతింప చేయుడానికి ప్రయత్నింపసాగాడు.

అధికార వాంఛగల శిబిరాజు ప్రస్తావించాడు. వినువారిని ప్రేరేపించడాని కతడు వేగంగా అన్నాడు—'సభాపతీ, చేటకరాజును లిచ్ఛవీయ గణతంత్రం నుండి పదచ్యుతుని చెయ్యాలి. అతనికి కఠిన దండనం ఇవ్వాలి.' అప్పుడే మరొక సభాసదుడన్నాడు 'శిబిరాజు నిజం చెప్తున్నాడు. ఏకాధికారంతో ప్రభుత్వాన్ని నడపువారు, లిచ్ఛవీయ పరంపరను భేదించువారు అగు లిచ్ఛవీయులకు తగిన పాఠం లభించడానికి చేటకరాజున కట్టి దండనం ప్రాప్తించాలి.' శిబిరాజు, అతని వలె అధికార వాంఛగల ఇతర రాజుల దృష్టి

అణ్వేవు పోయింది. ఇతడు చిరంజీవి. యువకుడు. వంశ పారంపర్యంగా వచ్చు లిచ్ఛవీయ పౌరుషమునకు నిజమైన, ఆదర్శవంతమైన ఉత్తరాధికారి. అతడు తరవాత అన్నాడు.—

'పూర్వీకులచే సంస్కరింపబడిన సంథాగారానికి దూరమగువారు, లిచ్ఛవీయ గణతంత్రం నుండి విడిపోవువారు, దానిని అవహేళనంగా చేసేవారు, లేక దానిలో కూర్చుండి తమ ఏకచ్ఛత్రాధికారాన్ని ఘనంగా కాంక్షించేవారు వీరందరి కాళ్ళూచేతులూ లేక శరీరాన్ని ఖండించడం లేక వారి ప్రాణాలు తీయడంలో మనం సంతుష్టిపడరాదు. ఏ దండం యొక్క గంభీర పరిణామం శరీరమంతా అనుభవిస్తుందో అట్టి దండం వాళ్ళకి లభించాలి. లిచ్ఛవీయ గణాలన్నీ ఒకటే. ముందు కూడ ఒక్కటిగానే ఉంటాయి. ఏ లిచ్ఛవీయుడు లిచ్ఛవీయ పరిషత్తు నుండి విడివడునో అతడు జీవించడానికి యోగ్యుడుకాడు..' వెంటనే ఒకరిద్దరు యువక సభ్యులు మాట్లాడారు, 'చిరంజీవి నిజం చెప్తున్నాడు.. చేటకరాజునూ అతని ప్రతినిధులనూ నష్టపరచండి.'

'నేడే.'

'ఇప్పుడే.'

'లిచ్ఛవీయు లెల్లప్పుడూ సిద్ధంగా ఉంటారు.'

'శౌర్యాన్ని ప్రేరేపించు ఆమ్రపాలిని పిలవండి.'

'మేము ఇక్కడి నుండే యుద్ధానికై ప్రయాణం చేస్తాం.'

'ఆమ్రపాలి లిచ్ఛవీయుల్ని రణభూమి వైపునకు ప్రయాణం చేయించడానికి సిద్ధంగా ఉంది. కాని ఒక లిచ్ఛవీయునితో పోరాడ్డానికి కాదు' అని ఎవరో అన్నారు.

సభాసదులందరూ అదిరిపడ్డారు. పాలి సంథాగారపు సింహద్వారంలో నిల్చుంది.

పై వాక్యాన్ని పాలి చాల దృఢంగా పలికింది. అందరూ మాటలుడిగి ఆమెను చూడసాగారు.

పాలి నర్తకా లేక అధికారిణా?..ఘల్లు ఘల్లుమను గజ్జెలతోనున్న ఆమె చరణాలు సభను మోహింప చేస్తూ ముందుకుపోయాయి. అవి దృఢంగా ఉన్నాయి. పాలి సభ మధ్య ప్రవేశించి పుస్తకం ఎదుటికి వచ్చి నిల్చుంది.






# ఆమ్రపాలి

పుస్తకానికి నమస్కరించి ఆమె సభాపతికి ప్రణామం చేసింది. దేశనర్తకికి పరిషత్తుకు రావడానికి అనుమతి ఉంది. కావున పాలి వచ్చుట చేత నగరశ్రేష్ఠి ప్రసన్నుడయ్యాడు. హృదయ స్వామిని అయిన పాలిచే ప్రభావితమై పరిషత్తు కొంత సేపటి వరకూ శాంతంతో ఉంది. నాయకులు, రాజులు, రాజ ప్రతినిధులు నిండుమౌనంతో కూర్చున్నారు. పాలి అంది—'లిచ్ఛవీయ పరిషత్తునకు జయమగుగాక! సభాపతికి జయమగుగాక!'

'సభాపతీ, లిచ్ఛవీయ గణతంత్రాని కొక మనవి చేయడానికి ఈ సేవకురాలిని అనుమతిస్తారా?'

'అనుమతా?'

ఆమ్రపాలి నివేదింపసాగింది ''పూజ్యులగు సభ్యులారా, లిచ్ఛవీయులు శౌర్యం వైపు పోతున్నారా లేక పశుత్వం వైపు పోతున్నారా? అను దానికి దేశనర్తకి జవాబు కోరుతోంది.'

శివరాజు అన్నాడు— 'పరిషత్తు అవమానింపబడుతోంది.' పాలి కోపించి అంది— 'అయితే, పరిషత్తు పరంపరగా వచ్చు తన పుణ్యాన్ని పోగొట్టుకున్నదా?... సభాపతీ, శాశ్వతంగా నమస్కరింపదగిన ప్రవేణి పుస్తకానికి సమీపంగా, లిచ్ఛవీయ సంథాగారంలో గుమిగూడి, లిచ్ఛవీయ గణతంత్ర పరిషత్తు సతతమూ పవిత్రంగా ఉంటుందని ప్రవేణి పుస్తకంలోని ప్రథమఖండం ఆజ్ఞాపిస్తోంది. అగ్నిశిఖరం మీద జల బిందువు పడినట్లు లిచ్ఛవీయుడెవడూ దానిని అవమానింపలేడు.. అయితే, నిజంగా పరిషత్తు అవమానింపబడిందా?'

'లేదు' అని చిరంజీవి అన్నాడు.

పాలి దృఢంగా చెప్పసాగింది—'ప్రవేణి పుస్తకంలోని పద్దెనిమిదో ఖండం ఆజ్ఞాపిస్తోంది. లిచ్ఛవీయుల ఐకమత్యం నష్టము కాకుండుటకూ, వారిలో అభిప్రాయ భేదాలు ఉత్పన్నం కాకుండుటకూ ప్రతి లిచ్ఛవీయుడూ ప్రాణపణంగా ప్రయత్నించాలి. వేరువేరుగా ఉండడంచేత లిచ్ఛవీయుల సమ్మిళిత అహంకారం నష్టమవుతుంది... సభాపతి మహోదయులు సమాధానం ఇస్తారా?.. ఒక భుజం ఖండింపబడుటవల్ల రెండవ భుజం అవశ్యం శక్తివంతమవుతుంది. కాని ఒక భుజం రెండు భుజాల పని చేయగలుగుతుందా?.. చేటకరాజును నష్టపరచిన లిచ్ఛవీయ గణాలు, శక్తివంతం అవుతాయా?'

శిబిరాజు కళ్ళెర్రజేసి అన్నాడు 'ఏమైనా, గణతంత్ర ద్రోహి లిచ్ఛవీయ చేటకుని నాశం కావలసిందే.'

పాలి గంభీరస్వరంతో అంది—'చెడుదారిన పోయిన లిచ్ఛవీయులను మంచి మార్గానికి తేవడం లిచ్ఛవీయుల కర్తవ్యం.'

శిబిరాజు అవమానితుడై ఈమాట అంగీకరించుటకు సంసిద్ధుడు కాక, 'ప్రవేణి పుస్తకం ఇలా ఆదేశింపలేదు' అన్నాడు.

ఆమ్రపాలి దగ్గర జవాబు సిద్ధంగా ఉంది. ఆమె అంది 'మీ అజ్ఞానానికి దక్షిణాపథంలో ఉన్న ఏ యువతికైనా సిగ్గుపడవలసి వస్తుంది... ప్రవేణి పుస్తకంలోని ఇరవైయో ఖండంలోని అంతిమ అనుష్టుప్పును ఎవరి చేతనైనా చదివించుకొని వినండి.'

శిబిరాజునకు మిత్రుడైన ఒక రాజ ప్రతినిధి అన్నాడు. 'సభాపతీ, ఒకస్త్రీ ఈ పరిషత్తులోని సభాసదుని అవమానిస్తున్నది.'

ఈసారి నగరశ్రేష్ఠి సాహసించి అన్నాడు. 'లిచ్ఛవీయ పరిషత్తులో స్త్రీపురుష భేదం లేదు. ఇక్కడందరూ లిచ్ఛవీయులే.'

చిరంజీవి మెల్లగా శిబిని ప్రేరేపించడానికన్నాడు—'దీనికై ప్రవేణి పుస్తకంలోని ప్రథమ ఖండంలోని మూడో శ్లోకాన్ని చదవండి.'.. మరల నిల్చుని అన్నాడు 'సభాపతీ, ప్రవేణి పుస్తకాన్ని విస్మరించిన వానిని దండించడానికి పరిషత్తు నిర్ణయిస్తే ప్రవేణి పుస్తకంలోని అంతిమ ఖండం ఒకక్రొత్త నియమంలో సమాప్తమవుతుంది.'

శిబి ఖిండిపడ్డాడు. అయినా, ఏమీ మాట్లాడలేకపోయాడు. అప్పుడు నగరశ్రేష్ఠి గాంభీర్యంతో అడిగాడు 'ఏ కోరికతో వచ్చావు పాలీ?'

చిన్న సీరియల్

# నిరుద్యోగపర్వం. 2వ కథ




## నిరుద్యోగి చిరుద్యోగి

వేళ్లపల్లి వెంకట - లక్ష్మీనారాయణ

ఓనాటి అర్ధరాత్రి ఒంటిగంట దాకా నిద్దరపట్టక మంచం మీద కదుల్తూ ఆలోచిస్తున్నాడు నిరుద్యోగి. ఆవేళ్టితో ఓ సినిమా వెళ్లిపోతూందని ఆసాయంకాలం తెల్సుకున్నాడు. డబ్బులు కోసం సాయంకాలం ఆరింటి నుంచి ఎనిమిదింటి దాకా తిరిగాడు. బజార్లో అప్పు పుట్టలేదు. యింట్లో పుట్టుతుందేమోనని ఆశతో యింటికొచ్చి బామ్మ దగ్గిర కెళ్లాడు. బామ్మ సణుగుతోంది. మధ్యలో అరుస్తోంది.

'అవున్నాదే తప్పు. వొకళ్లననడం మెందుకు?... అయినా నేనేం అన్నాన్ని... పిల్లదాన్నట్టా కొట్టకే' అంటె తప్పొచ్చిందా?...నా భారమంతా ఏదో మోసేస్తున్నట్టు మాట్టాడేసింది. యిన్నేళ్లొచ్చినా నా పన్నేం చేసుకుంటున్నాను. ఆ రెండు కుంటల్లో వచ్చేదాంతో తింటున్నాను..యీవిడేం మోస్తోంది నా బరువు' అంటూ...నిరుద్యోగి బామ్మ దగ్గిర కూర్చున్నాడు.

'ఏవిటి బామ్మా! మా అమ్మేనా?...ఏం జేసింది?' అన్నాడు అనునయించే ధోరణిలో. బామ్మ యివేం వినపణ్ణట్టూ, వినపెట్టూ మాట్టాళ్లేదో అరగంట వరకు. అంటె బామ్మకి బోల్డు కోపం వచ్చిందన్న మాట. మళ్లీ నిరుద్యోగనునయించబోతే,

'పోరా, అంట్ల వెధవ.. ఆ అప్పకి తగ్గ కొడుకువే, డబ్బులు కావాల్సినప్పుడు కల్లబొల్లి కబుర్లు చెప్పటానికి.. అంతా భజంత్రీ వెధవల్దారికారీ యింట్లో..పో, యిక్కణ్ణుంచి'' అంది. దాంతో బామ్మ ఆసరా కాస్తాపోయింది. యింకెక్కడన్నా దొరికే ఆశ కూడాలేదు. సినిమా ధ్యాస మాత్రం అట్టాగే వుంది. యింకా పైగా పెరుగుతోంది కూడా. గోడ గడియారం ఒంటి గంటన్నరయిందంది.. 'అయ్యో, యీపాటికి సినిమా అయ్యింటుంది.. ఆ సినిమా రేప్పొద్దున్నే యీ వూరొదిలి పెట్టి వెళ్లిపోతుం దిగావల్ను. మళ్లీ అది యీ వూరొచ్చే దెప్పుడో? తనకి చూసే భాగ్యం ఎప్పుడో?' అంటూ విలపించాడు నిరుద్యోగి.. కాస్సేపయ్యాక పక్కింటి ముందు రిక్షా ఆగిన చప్పుడయ్యింది. నవ్వులు వినిపించాయ్. ఆ నవ్వుతున్నమ్మాయ్ పక్కింటి పిన్నిగారి కూతురు లీల. పక్కన్నవ్వుతున్నతను లీల మొగుడు. పదిరోజుల్నాడే పెళ్లయిందిద్దరికీ. పిల్లద్దరూ పదిరోజుల్నించి రెండో ఆట సినిమాకే వెడుతున్నారు, మొదటాటకయితే బజార్లో వాళ్ళు చూసి 'హయ్యో, ఏవిటి విడ్డూరం' అంటారని. పెళ్ళయిన సాయంకాలం యిద్దరూ కూర్చుని వూళ్లో వున్న తిరిగెడ్తున్న కొత్త సినిమాల్ని, తిరిగొచ్చిన పాత సినిమాలు ఏవేవిటో లిస్టు తయార్జేసుకున్నారు. కొత్తగా వచ్చిన సినిమాలకయితే జనం వుంటారు. అందుకని పాత సినిమా ల్జాస్తే పై క్లాసంతటికీ రాజకుమారుడు రాజకుమారిలా వుండొచ్చని లలా వెడుతున్నారు. అయినా సినిమా కెళ్లేది సినిమా చూటానిక్కాదుట. కబుర్లు చెప్పుకోటానికిట. ఆ సంగతి మూడో సినిమా కెళ్లొచ్చాక యింట్లో వాళ్లకి తెల్సింది. లీల మొగుడి రెండో అన్నగారు మూడో సినిమా కెళ్లొచ్చాక తాపీగా వో ప్రశ్నేశాడు. 'రాత్రే సినిమా కెళ్లారని' 'చిలకా గోరింకా' అన్జెప్పాడు తమ్ముడు.

'ఎవరేక్షన్ బావుంది దాంతో.. భానుమతిదా? ఎన్టీరామారావుదా?' అన్నాడాయన మళ్లీ.. లీల మొగుడు లీలొంక చూశాడు. లీల గూడా మొగుడొంక చూసింది. అత

గాడు మాట్లాడకపోయేప్పటికి తనే మొదలెట్టింది' నాకే హో భానుమతేక్షన్ నచ్చిందండీ. మా తమ్ముడి గార్కే హో ఎన్టీరామారావేక్షన్ట' అంటూ. తమ్ముడందుకుని 'అవును కాదు ట్రా, ఎన్టీరామారావు బాగా చేశాడు కదూ?' అన్నాడు. ఇంతలో తమ్ముడి పెద్దన్నయ్యొచ్చాడు. 'అవును. ఇద్దరూ బాగానే చేశారు.. ఏమి పన్లేశారు గానీ.. ఇలా డబ్బులెందుకు ఖర్చెట్టడం.. మిమ్మల్నెవ్వరూ ఉద్ధర్చు చెయ్యరు, ఆ దాదా ఎక్కి మాట్లాడు కొండన్నాడు. శీల కొంగు మెలిపెడ్తూ కిందకి చూసింది. శీల మొగుడు రువాల్తీసి మొహం మీదేసుకున్నాడు. ఆమర్నాడు అన్నయ్య లిద్దరూ పూరెళ్ళిపోయారు. ఇంట్లో ఫ్రీగా వుంటన్నందని మళ్ళీ సినిమాలకి బయల్దేరారిద్దరు. ప్స్, వాళ్ళట్టా సినిమా ఏవిటో తెలీకుండా డబ్బులు ఖర్చెడ్తుంటే తనకి సినిమా కుండా సినిమా చూడాలని, మాటపోకుండా వినాలని వున్నా లాభం లేకపోతూందని విచారించాడు నిరుద్యోగి. సోషలిజంలో ఇలా వుండదుట. పెళ్ళికాని వాడు అయినవాడు, వుద్యోగం వున్నవాడు, లేనివాడు, పన్చేసే వాడూ చెయ్యనివాడు, ఇష్టమున్నవాడు, లేనివాడు అంతా సినిమా ల్చూడాలిట. అందరూ ఒకేలా వుంటార్ట. 'అహా..అదే న్యాళ్ళకో' అనుకున్నాడు నిరుద్యోగి. రోజూ పొద్దున్నే సైకిలు వెనకాల ఫైళ్ళు కట్టుకుని ఆఫీసు కెళ్ళే చిరుద్యోగి గుర్తుకొచ్చాడు. 'అహా. అతనికేం ఇవ్వాళ చక్కగా సినిమా కెళ్ళుంటాడు. ఉద్యోగం చిన్నదైతే ఏమాత్రం ఏం.. ఫస్టొచ్చేసరికి నూటముప్ఫయ్యెనిమిది రూపాయిలు చేతిలోపడ్తయ్! రోజుకోసారి సినిమాకి, మూడుసార్లు హోటలుకీపోవచ్చు. ఇవ్వాళ వెళ్ళిపోతున్న రెండు సినిమాలకి ఫస్టుషోకి సెకండుషోకి వెళ్ళింటాడు. అదృష్టవంతుడు.. చిరుద్యోగీ ధన్యజీవుడవన్న నీవే గదా' అనుకుని కళ్ళు మూసుకున్నాడు.

అదే వేళ్టికి ఇంట్లో లాంతరు ముందు కూర్చుని ఫైళ్ళు తిప్పుతున్న చిరుద్యోగి పక్కింటిగడియారం కొట్టిన గంట విని అయ్యో, ఒంటి గంటయ్యింది. ఇంకా రెండు ఫైళ్ళున్నయ్. రేపొద్దునకవుతుయ్యా అని గాభరాపడ్డాడు. ఆవలించాడు. నిద్రాదేవి రెండు ఫైళ్ళపతల ఒంటికాలి మీద నిలబడి 'వొస్తున్నా వొస్తున్నా'నంటోంది. యిందాకట్నుంచి. రెండు ఫైళ్ళు అడ్డం పెట్టి 'యీ రెండు అవ్వనీ' అంటున్నాడు చిరుద్యోగి. కానీ చిరుద్యోగి చూస్తున్నప్పుడు రెండు ఫైళ్ళమీంచి ఓంగున ఛూకి ఇవతల కొస్తోంది నిద్రాదేవి. చిరుద్యోగి రెండు చేతులు రుద్ది కళ్ళ మీదెట్టుకుంటున్నాడు యీలోగా చంటాడేడ్చాడు. వుయ్యాల్దగ్గర కెళ్ళి వాణ్ణెత్తుకుని వోట్లో పాల్సీసా పెట్టాడు. చిరుద్యోగర్ధాంగి చంటాణ్ణే ఎడ చంటిదాన్ని వొదిలి పైకి ముగ్గుగ్గీ తెనుకుని సినిమాకెళ్ళింది.. ఎడచంటిది కూడా లేచింది. ఎడచంటిదని పేరేగాని దానికీ చంటాడికి ఏడం ఏడాది కూడాలేదు. చంటాడి వోట్లోంచి పాల్సీసా తీసి దాన్నోట్లో పెట్టాడు. వాడేడ్చాడు. వాణ్ణి చూసి అదీ ఏడ్చింది పాల్గాగుతూ కూడా. 'నీకే వొచ్చిందే, పాల్గాగుతూ కూడా ఏడుస్తున్నావ్' అన్నాడు. యీ దొరసానమ్మగారికివ్వాళ సినిమా కావాల్సొచ్చింది.. వాళ్ళిద్దర్తోపే సరిపోతుట్టుందిప్పుడు ఆ ఫైళ్ళ సంగతి' అంటూ విసుక్కున్నాడు. అవ్వాళో సినిమా వెళ్ళిపోతూందిట. పొద్దున తనాఫీసు కెళ్ళేప్పుడు 'ఏవండీ, ఇవ్వాల్టితో సినిమా వెళ్ళిపోతూందిట. చాలా బాగుందంటున్నారు. వెడదావండి.. మనం కిందటి వైశాఖ మాసంలో గావల్ను చూశాంసినిమా అంది. 'అవును.. కిందటి వైశాఖమాసంలో చూసింది నువ్వు. నేనా కిందటి జేష్ట మాసంలో చూశా'నన్నాడు చిరుద్యోగి. చిరుద్యోగి రెండేళ్ళ క్రితం మూడోపిల్ల పుట్టక పూర్వం వెళ్ళాడు సినిమాకి. తర్వాత్తర్వాత మొదొచ్చినవే ఫైళ్ళని తప్పించుకోడానికి తలప్రాణం తోక్కొస్తోంది. చచ్చి చెడి ఆఫీసులో కూర్చుని ఫైళ్ళన్నీపూర్తిచేస్తే అంతకన్నిరెట్లు ఫైళ్ళు సైకిలెక్కుతాయంటున్నై. యింటికి తీసుకెళ్ళే ఫైళ్ళక్కట్టానికుంచిన తాడు తెగేట్టు పెరుగుతున్నయ్ ఫైళ్ళు. యింటికెళ్ళి తాడ్తెగేట్టు పన్జేస్తున్నాడు తను. దాంతో సినిమా ఆలోచన్లు రావడం మానుకున్నయ్. ఆలోచన్లొచ్చినప్పుడు డబ్బులుండవ్. దాంతో సినిమాలు మానుకున్నాడు. అయినా అప్పుడప్పుడూ పక్కసీటువాడు సినిమాల్సంగతి చెపుతుంటే వుత్సాహావొస్తుంది. తనూ సినిమాల గురించి మాట్లాడ్దామనుకుంటాడు. ఒకరోజున 'ఫలానా అతను బలేగా చేశాడండి హరిశ్చంద్రుడిగా' అంటున్నాడొక సినిమా జీవి. వీడికి ప్రతి సినిమా మొదట్రోజున మొదటిషో చూడందే నిద్రపట్టదు. కొత్త సినిమా వూళ్లో కొచ్చిందంటే చాలు యింట్లో గొడవ చేస్తాడుట టిఫిన్ రడీ చెయ్యమని. తొమ్మిదింటికే భోంచేసి టిఫిన్ కేరియరు, మంచినీళ్ళ చెంబుతో సిళ్ళా తీసుకుని పదింటికెళ్ళి బుక్కింగు దగ్గర కూర్చుంటాడు రెండుగంటల సినిమా టిక్కెట్టు కోసం..



'ఎవరూ.. అతను గదూ.. యాక్షనం టు అతన్దేగదండి.. నిజంగా కాటిసీన్లో కాటికెట్టుకున్న ఆడాళ్లే కాకుండా కళ్ళజోళ్ళలేసి మొగాళ్ళు కూడా ఏడ్చారుగదటయ్యా' అన్నాడు చిరుద్యోగి, తనకీ సినిమా జ్ఞానం వుందని చెప్పటానికి, తనూ సినిమాల్జూస్తానని నమ్మించేందుకు.

'నువ్వు భలేవాడివే.. నువ్వు చెప్పినాయన మూకి 'హరిశ్చంద్ర'లో వేసేడేమో. మూకీ వెళ్ళాక ముప్ఫయి తడవల్తీశారు 'హరిశ్చంద్ర' సినిమాని.. రేపాకాయన మళ్ళీ తీస్తున్నాట్ట.. నే చెప్పే హరిశ్చంద్రుడు వేరు. ఇవ్వాళొచ్చిన 'హరిశ్చంద్ర' సంగతినే చెప్పేది' అన్నాడు సినిమా జీవుడు.

ఏమైతేనేం.. మళ్ళీ మళ్ళీ పాత సినిమాలే తీస్తున్న ప్రొడ్యూసర్లనకో దండ వేడ్తాడు చిరుద్యోగి. అలాంటి సినిమాలొచ్చినప్పుడు తన పాతరోజుల్లో చూసిన సినిమా సంగతులు యీ కొత్త సినిమా కన్వయిస్తూ. బయట బోర్డుల్జూసి యాక్టర్లెవరో చూసి వాళ్ల పేర్లు మాట్లాడ్తూ యింకా తనకి సినిమా ప్రపంచంతో సంబంధం పోలేదని నలుగుర్తో నమ్మే వాళ్ళతో చెప్తుకుంటూ వుంటాడు. కాని నిజం మాత్రం








## చిరుద్యోగపర్వం

రెండుమూడేళ్ళకో సినిమా చూట్టం అన్నదే. అలాంటి చిరుద్యోగిని 'సినిమా కెడ్దామండీ' అంది అర్ధాంగి. పొద్దున సరేనని రాత్రి కింటికొచ్చేప్పుడు సైకిలు మీదిన్ని ఫైళ్ళు మరిన్ని ఫైళ్ళు పక్క రిక్షాలోనూ పెట్టుకుని యింటికొచ్చాడు. టైం తొమ్మిద యింది.' ఏవండి.. యింతాలిశ్యమా?' అంది అర్ధాంగి. 'ఆలిశ్యమా.. ఎంత.. ఒహగంటే గదా.. సెకండుషోకెళ్ళొచ్చు. సరే, పిల్లల్ని తీసుకుని నువ్వెళ్ళు. నా కొస్తానికి వీల్లేదు. యీ ఫైళ్ళన్నీ యిప్పుడే చూడాలి' అన్నాడు.

'అట్లా ఎట్లాగండి.. నేని పిల్లల్ని దర్ని సవదాయించలేను హాల్లో..చంటాణ్ణి ఎడచంటిదాన్ని మీరు చూస్తూ వుండండి' అంది. 'అయ్యో.. టైం తొమ్మిద్దా టోంది..మీరా ఫైళ్ళ తర్వాత చూద్దురు గాని.. మీ కన్నం పెట్టి వెడ్తాను, లేవండి' అంది..యీవిడికి హాల్లో లైట్లార్పిన క్షణం దగ్గర్నుంచి జనగణమన దాకావుండి చూస్తేగానీ సినిమా చూసినట్టు లెక్క గాదు. యీవి డొకసారి సినిమా కెళ్ళి నప్పుడు యింటర్వెల్లో పిల్లని బయటకి తీసుకెళ్ళొచ్చేసరికి బెల్లు కొట్టేసి స్లైడ్సు వేస్తున్నార్ట. అప్పటికే పిల్లని సొంతం మంచినీళ్ళు తాక్కుండా లాక్కొచ్చేసింది. కానీ అప్పటికే మూడు స్లైడ్సు చూపించేశాట్ట. యీవిడొచ్చి కూర్చుని పక్కావిణ్ణి 'ఎంతసేపయ్యింది మొదలెట్టి ఏవేవిటి చూపించాడు ముందు మూడింట్లో' అని అడిగింది. ఆవిడ సరిగా గుర్తులేదంది. యిటు పక్కావిణ డిగితే యీవిడా అట్లాగే అంది. 'అయ్యో.. హాల్లో కూర్చున్నారు గందా కొంచెం వెనకాముందూ అయినా ఫర్వాలేదని వెడితే భలే పన్జరిగిందే.. ఏం చెయ్యటం యిప్పుడు' అని విచారించింది. యింతలో పిల్ల ఎదురుకుండా వున్న కుర్చీ మీద కాళ్లెట్టింది. గేటు దగ్గరవాడొచ్చి 'ముందు సీట్లమీద కాళ్ళు పెట్టకూడ్దమ్మా.. పిల్ల కాళ్ళు తీయించండి'అన్నాడు.

'యిప్పుడేనయ్యా పెట్టింది కాళ్ళు' అంది, సీట్ల మీద కాళ్ళు ముందు పెట్టకుండా తర్వాత పెడితే ఫర్వాలేదనుకుందీ విడ.. 'ఏం చూపించారు ముందు' అని వెళ్లిపోతున్న గేటువాణ్ణి పిల్చి అడిగింది.

వాడ్నెప్పాడు. మొదటిది 'ముందు సీట్లమీ్మై కాళ్లు పెట్టొద్దనిట. రెండోది 'రోజూ మూడాట్లు ఎలా వేసేదీ చెప్పిందిట. మూడోది 'యీ సినిమా యింకా ఎన్నో రోజులుండదు. యింకో టాస్తోంది. అది బ్రహ్మాండంగా వుంటుంది దీనికంటె' అనిట అప్పటిగ్గానీ యీవిడికి మనస్తిమితంరాలేదు. అలా మొదట్నుంచీ చూడాలని సినిమాకి నాలుగ్గంటల ముందు నించీ ప్రయాణ సన్నాహాలు చేస్తుంది. ఓగంట సినిమా హాల్దగ్గిర కూర్చొందే తోచదీవిడికి.. చిరుద్యోగి చేత అన్నం తొందరగా తినిపించి ముగ్గురు పిల్లల్నీ కూడా తీసుకుని, ఇద్దర్ని వెనకాల దిగేసి చక్కాపోయింది. వెళ్తూ 'ఫర్వాలేదులెండి..పాలుబట్టాను. వాళ్లు రెండింటి దాకాలేవరు' అని హామీ యిచ్చింది.. రెండింటి దాకాలేవరన్న యీ యిద్దరూ యిప్పటికో డజనుసార్లు లేచారు. చిరుద్యోగికి క్కోపం వచ్చింది. చిరుద్యోగికి పెళ్లాం మీదొచ్చిన కోపం మాత్రం దోట్లోకు మంట మాదిరి కాస్సేపుంటుంది. తనకు సినిమాల్జూసే అదృష్టం లేకపోగా సరిగా పస్సేసుకోటానికూ్కడా వీల్లేదు. 'ఖర్మ' అని నెత్తి మీద కొట్టుకున్నాడు. 'మిగిలిన మనిద్దర్నీ కూడా బతకనిచ్చేట్టు లేడే' అని నెత్తి మీదున్న రెండు వెంట్రుకలు ఒకదాన్నొకటి కావలించుకుని పడుకున్నయ్. బట్టతల మీద కొట్టుకునే వ్పటికి 'ఖంగ్'మంది. యీ మోత విని ఏడుస్తున్న పసివాడు నవ్వాడు. పక్కనున్న చంటిది కూడా నవ్వింది. సరే వీళ్లిలా అన్నా ఏడవకుండా వుంటారని బట్టతల మీద 'సరిగమలు' వాయిస్తున్నాడు.. యిట్టా కొట్టుకుంటూండగా చిరుద్యోగి బుర్రలోకి నిరుద్యోగొచ్చాడు. ప్రతిరోజూ చిరుద్యోగాఫీసు కెళ్లేవేళ్టికి రాజకుమారుళ్లా లేచి ఆవులిస్తూ బ్రష్ తీసుకుని వరండాలో నుంచున్న నిరుద్యోగి కన్పిస్తాడు... అహా.. ఎంతదష్టం చేసుకున్నాడో... పొద్దున పదింటిదాకా నిద్ర.. అతనికేం? ఎప్పుడు కావాలనుకుంటె అప్పుడు పోతాడు నిద్ర. యిష్టవొచ్చినంత లీషర్.. చీకూ చింతాలేని బ్రతుకు.. పీక్కుతినే వాళ్లెవరూ లేరు. జుట్టు పీక్కోవాల్సిన పన్లేదు. చక్కటి క్రాఫింగు.. యిష్టవొచ్చినంతసేపు షికార్లు కొట్టొచ్చు. యిష్టవొచ్చినన్నిసార్లు సినిమాల్కాడొచ్చు. డబ్బులు వాళ్ల బామ్మన్నా యిస్తుంది. అప్పు చెయ్యాలన్న బాధలేదు. సినిమా చూస్తాని కాఫీసరు పర్మిషనడగాల్సిన పన్లేదు. యీపాటికే సెకండు షోకో వెళ్లి యీలేసుకుంటూ తిరిగొస్తూ వుంటాడు. అతనికేం, అట్నించటు మిడ్ నైట్ షోక్కూడా పోతాడు. ఫ్రీబర్డ్...నిరుద్యోగి! నీది కదా లైఫ్ అంటె' అనుకుంటూ ఆవలించాడు చిరుద్యోగి.

'ఏవిటండీ ఆలోచిస్తున్నారు.. పిల్లలిద్దరూ గుక్కాబట్టి ఏడుస్తుంటే' అన్న అర్ధాంగి పిలుపుతో యీ లోకంలోకొచ్చాడు చిరుద్యోగి.

* * *

ఓ సాయంకాలం శంకర్‌విలాస్ ఎదురుగా వున్న ఫుట్‌పాత్ మీద నిలబడ్డాడు నిరుద్యోగి యధాప్రకారం. చిరుద్యోగి, యింకోడు సైకిళ్లు దిగి, ఫైళ్లు తీసి చంకల కింద పెట్టుకుని హోటల్లో కెళ్లారు. నిరుద్యోగి నిట్టూర్చాడు. 'చిరుద్యోగెంత దృష్టవంతుడు. ప్రతి సాయంకాలం తప్పకుండా హోటలు కెడ్తాడు. ఒఖ్ఖ సాయంకాలం అనేవిటత గాడికి? యివాళ ఈపాటికెన్నిసార్లు వెళ్లుంటాడో హోటలుకి. అతనికేం నెలనెలా జీతంవొస్తుంది.. తనకింట్లో వాళ్లిచ్చిన పదిరూపాయలు పదిరోజులు గూడా రావు. ఆ పదిరోజుల్లో ఒకయిదార్తడవలు హోటల్లోపల చూస్తాడు అంతే. మిగతా రోజుల్లో యిలా నిలబడి హోటలు మొహం, దాంట్లోంచి వచ్చేవాళ్ల మొహాలు చూస్తూండటమే పని.. చిరుద్యోగికేం, ఉద్యోగస్తుడు డబ్బులొచ్చి పడ్తయ్ ఫస్టుకి.. తన కలాంటి వుద్యోగం వచ్చినా బావుణు. ప్చ్.. ఎట్టా వస్తుంది. దేనికైనా పెట్టేపుట్టాలి. లేదా పుట్టి పట్టాలి. తనే ఆఫీసర్ని పట్టలేకపోతున్నాడింతవరకు. అందుకే యిలా వున్నా నింత వరకు. చిరుద్యోగి జాలీగా స్నేహితుడ్ని కూడా లాక్కెడ్తున్నాడు హోటలికి. అతనో పరిచయం చేసుకున్నా బావుణు, హోటలికి లాక్కెడ్తూంటాడు రోజూ.' అంటూ పెదిమలు నాక్కున్నాడు నిరుద్యోగి.

చిరుద్యోగి, పక్కతను హోటల్లో కెళ్లారు. పక్కవాడు కూడా చిరుద్యోగే. చిరుద్యోగు లిద్దరూ మొహాలు కడుక్కుని కూర్చున్నారో టేబిలు ముందు. 'ఏంగావాలంటూ గాలిలా వచ్చి 'జాంగ్రీ, హల్వా, బూందీ, పకోడి, పెసరట్....' అంటూ లిస్టు చదివి రివ్వునపోయాడు సర్వరు. లిస్టు విని గుటకలు మింగారు చిరుద్యోగు లిద్దరూ. సర్వరు మళ్లీ వచ్చి రెండు గ్లాసుల్తో నీళ్లు పెట్టాడు. చిరుద్యోగు లిద్దరూ గ్లాసుల్లో నీళ్లు గడగడ తాగి 'యింకే వున్నయ్'అన్నారు. వాడింకో నాలుగు పేర్లు చెప్పాడు. ఆ పేర్లు విని మంచి నీళ్లు తాగి మళ్లీ నాలుగు గుటకలు మింగారు. గుటకలు మింగి 'వన్ బైటు కాఫీ' అన్నారు... రెండు కప్పుల్లో వున్న అరకప్పు కాఫీని అద్దాల్లోంచి కనిపిస్తున్న స్వీట్సు వంక చూస్తూ చప్పరిస్తున్నారు. చప్పరించుకుంటూ మాట్లాడ్తున్నారు. 'మళ్లీ ఆ ఫైలు మీద కొర్యిరీ వచ్చింది. 'యీ ఫైలు పుటప్ చెయ్యాలి' అని మాట్లాడు కొంటున్నారు. ఒకళ్ల మీదొకళ్లు చేతు లేసుకుంటున్నారు.. యిలా కాఫీలగ్గొట్టేసుకు తాగటం చిరుద్యోగుల కలవాటే. ఒకరోజూ కడు, యింకోరోజింకొకడు అరకప్పుకి బిల్లివ్వటం మామూలే. అందుకే చిరుద్యోగు లిద్దరు విడిపోతారు ఆఫీసులోంచి బయట














## నిరుద్యోగపర్వం

కొచ్చేటప్పుడు.. అర్ధరకప్పు కాఫీని అరగంట తాగి లేచారు నిరుద్యోగులు.. వాళ్ళు లేచిన కుర్చీల్దగ్గర కిన్నరొచ్చి నిలబడ్డారు. బొడ్డుకి బెత్తెడు కిందికి, బొటుకి జానెడు పైకి, కాలుకి అంటిపెట్టుకుని వున్న పొంటు కట్టి, దాంటో చొక్కావేసి, చొక్కా చేతులు మోచేతి కారంగుళాల పైనరకూ మడిచారు. ఇద్దరూ జేబు రుమాళ్ళు తీసి రెండు సీట్లు తుడిచారు. తుడిచి మళ్ళీ 'ఉఫ్' అని వూదారు సీట్ల మీద. వీళ్ళిద్దరూ సీటుగాళ్ళు. సీట్లు తుడవటమే ఉద్యోగం ఇద్దరికీ. కార్లల్లోగానీ, సినిమా హాళ్ళల్లోగానీ, పార్కుల్లోగాని మరెక్కడైనాగానీ సీట్లు పత్తడవలు తుడిచిగాని కూర్చోరు. చివరికి నేల మీద కూడా అంతే. ఆ చొక్కాలాగూ మాసిపోతే ఇంకో జత లేక చేస్తున్నారో ఇట్లా మరెందుకో తెలియదు. క్లీనరు కుర్రాడు దూరాన్నుంచుని చూస్తున్నాడు. వస్తోవనీగా వాళ్ళిద్దరూ ముందున్న టేబిలు కూడా తుడుస్తారేమోనని గావల్ను. కాని వాళ్ళు నిరుద్యోగులొదిలిన సీట్లని మాత్రం తుడిచి వాటి మీద రుమాళ్ళు పరిచి కూర్చున్నారు. అదిగాక నిరుద్యోగులొదిలిన ప్రదేశాల్లో కొంచెం దుమ్ముపడుతుందిట. జోగి జోగి రాసుకుంటె బూడిద రాలినట్టు నిరుద్యోగి నిరుద్యోగి రాసుకుంటె దుమ్ము రాలుతుందిట. అసలా దుమ్ము ఫైళ్ళనించి వీళ్ళ బట్టలకి పడుతుంది. వీళ్ళొకళ్ళనొకళ్ళు రాసుకున్నపుడు కిందపడుతుంది...

హోటల్లోంచి బయటకొచ్చిన నిరుద్యోగి ఎదురుగా వున్న నిరుద్యోగిని చూశాడు 'ఆహా..ఇతగాడికి పెళ్ళికి ఖుషీగా ఇక్కడ నిలబడుంటాడు. పని చెయ్యాల్సిన ఖర్మ లేదు. హుషారుగా చూస్తూ ఎనిమిదింటి దాకా నిలబడ్తాడు. ఎందుకు నిలబడ్డు? హోటల్లో నాలుగు స్వీట్లు, మూడు పెసరట్లు తింటాడు. ఫుల్ అరకప్పు కాఫీ తాగుతాడు. ఇంటో వాళ్ళిస్తారు డబ్బు. వెనకాముందూ చూసుకోకుండా జల్సాగా ఖర్చు పెడ్తాడు. ఇలా బజార్లో మధ్యాహ్నం రెండింటినించి నిలబడ్తాడుగావల్ను. ఏం నిలబడక? ఫుల్ లీవర్..అదృష్టవంతుడు' అనుకుంటూ ఫైళ్ళని సైకిలు మీద పెట్టి ఇంటిదారి పట్టాడు నిరుద్యోగి.

(ఇంకా ఉంది)

# కుసుమ-కోమలం





కుసుమం వంటి కోమలం. పూబంతి వంటి
సౌందర్యం. హిమాలయా బుకే స్నో వల్ల
మీ చర్మ సౌందర్యం అంత మనోహరం.
దాని మృదులత మీ చర్మాన్ని మునుపటికంటె
అతి కోమలంగా వుంచుతుంది...పట్టు వంటి
కోమలం. పౌడర్‌ను ఎంతో చక్కగా అంటి
యుంచుతుంది కూడా. ఆ పరిమళమేమో!
కోమలం, సౌమ్యం, దివ్యం.
కుసుమం వంటి కోమలం, పూబంతి వంటి
సౌందర్యం.....




హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి
శ్రేష్ఠమైన ఉత్పత్తి.

...అట్టి మనోహరమైన చర్మసౌందర్యం కోసం

## హిమాలయా బుకే స్నో

లింటాస్ HBS. 34A/149 Te.

# “...ఎందుకాలిడినా” ఆంధ్రుల కళాపిపాస

**ఉషారాణి భాటియా**

సెప్టెంబరు నెల ఢిల్లీలో బాగుంటుంది. వేసవి తీక్షణత తగ్గి, చలి కాలపు ఛాయలు ఎదురవుతాయి సాయంత్రం 5 గంటలు దాటగానే. అలాటి ఒక చక్కని సాయంత్రమే ఆంధ్రులంతా కమ్యూనిటీ హాలులో కల్సుకోవటం జరిగింది. రంగు రంగుల కంచి పట్టు చీరలు, తలలో మల్లెలు, చేతిలో చిన్నారి పాపలతో స్త్రీలు, స్నేహితుల పలకరింపులతో ఆంధ్రదేశం అక్కడికి తరలి వచ్చిందా అన్నట్లు కన్నుల పండుగ అయింది ఆ ప్రదేశం.

“నేను ఒక కళాకారుణ్ని కాను. కనీసం కళా విమర్శకుణ్ని కాను. కానీ లలితకళలంటే నాకు ప్రాణం. కళాభిమానం గల ఒక సామాన్యుడిగా నేను ఇక్కడికి వచ్చాను. ఈ రోజు నాస్మృతిపథంలో బళ్ళారి రాఘవ, సత్యనారాయణల వంటి అనేక నటులు మెదులుతున్నారు. ఆ నాటి రంగస్థల నటులతో పోల్చిచూస్తే ఈ నాటి నాటక వ్యవస్థ ఒక మెట్టు దిగజారిందనే చెప్పాలి. దీనికి ముఖ్య కారణం సినిమాలు, రేడియో అనుకుంటాను. విద్యా వినోదాల్ని పెంపొందించే లలితకళల్ని ఒక ఉన్నత స్థాయికి తెచ్చి, వాస్తవిక జీవితానికి సంబంధించిన యితివృత్తాల ద్వారా ఒక సాంఘిక ప్రయోజనాన్ని సాధించేందుకు ప్రయత్నిస్తున్న ఈ సమాఖ్యని ఎంతగానో అభినందించవలసి వుంది. అంతే కాదు, రాష్ట్ర ప్రభుత్వం ఆదరాభిమానాలు కరువయితే సాంస్కృతిక సమాజాలు అడుగున పడిపోతున్న రాజధానిలో సమాఖ్య తన ప్రత్యేకతని నిలబెట్టుకుంది. ఈ రోజు మనందరికీ గర్వకారణమూ, ఆనందదాయకమూ అయినది. సమాఖ్యకు మీ నుంచి యింకా సానుభూతి, సహకారం లభిస్తాయనీ, ముమ్ముందు ఈ సమాఖ్య ఎంతో అభివృద్ధి చెందుతుందనీ ఆశిస్తున్నాను.....”

ఢిల్లీలోని దక్షిణభారత నటీనట సమాఖ్య సెప్టెంబరు 11 వ తేదీన జరుపుకున్న తొమ్మిదవ వార్షికోత్సవ సందర్భంలో, భారతదేశ ప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకా సుబ్బారావుగారి చల్లని శుభాకాంక్షలివి.



సమాఖ్య తొమ్మిదవ వార్షికోత్సవ సందర్భంలో భారతప్రధాన న్యాయమూర్తి శ్రీ కోకాసుబ్బారావుగారు ప్రసంగిస్తున్న దృశ్యం.

ఈ రోజు ఈ సమాఖ్య అందుకుంటున్న కీర్తి గౌరవాల వెనుక ఎందరో యువతీయువకుల దీక్ష, సహనం దాగి వున్నాయి.

ఉద్యోగరీత్యా ఢిల్లీ తరలివచ్చిన ఆంధ్రుల సంఖ్య 1957 వ సం. నికే బాగా పెరిగివుంది. కానీ నలుగురు ఆంధ్రులు ఒక చోటచేరి తమ కత్యంత ప్రియమైన లలిత కళల్ని పోషించుకునేందుకు అవకాశం లేక పోయింది. నాటకంలోని కొన్ని అంశాలు ప్రదర్శించటం తప్ప నిడివిగల నాటకాలు చూసే అదృష్టం లేకపోయింది తెలుగువారికి. దీనికితోడు, తమ సాంస్కృతిక విలువల్ని ఎక్కడ ఎంత దూరాన్నయినా సరే ప్రతిష్ఠించుకోవాలని వారు తపన పడసాగారు. వివిధ కార్యాలయాల్లో ఉద్యోగాలు చేస్తున్న మధ్య తరగతి యువకులు కొందరు ఓ సాయంత్రం కలిశారు. ఢిల్లీలోని ఆంధ్రులకి ఒక శ్రావ్యమైన గానకచ్చేరీ, యింపైన నృత్యప్రదర్శనం నాటకం, చూసే అవకాశం కల్పించాలని తీర్మానించారు. ఆ నాటి ఆ నిశ్చయమే పాతికమంది సభ్యులతో ఈ సమాఖ్య రూపొందింది.

ఢిల్లీ నాట్య సంఘానికి అనుబంధంగా ఏర్పడిన ఈ సమాఖ్య ప్రేక్షకులకి కేవలం వినోదం అందజేయటమే ముఖ్యాశయంగా పెట్టుకోలేదు. నాటక రంగం స్థాయిని పెంపొందించాలని ఎంతో ఉబలాట పడింది. నగరంలోని అనేక యితర సాంస్కృతిక సంస్థలతో కలిసి, పరస్పరం భావాలు, అనుభవాలు పంచుకుంటూ నాటక రంగంలోని వివిధ కళలని అకళింపుజేసుకో ప్రయత్నించింది. తత్ఫలితంగా ఒకొక్క ప్రదర్శనానికి రంగులు దిద్దుకుంది. నాటక రంగానికి సంబంధించిన సాహిత్యంతో (దాదాపు నూరు పుస్తకాలతో) ఒక పుస్తక భాండాగారాన్ని నెలకొల్పింది.

ప్రప్రథమంలో శ్రీ బెజవాడ గోపాల

రెడ్డి, అక్కినేని నాగేశ్వరరావు గారల సలహా, ప్రోత్సాహము సమాఖ్యకి లభించాయి. కాని వారి ప్రస్థానానికి అనేక కష్టాలని ఎదుర్కోక తప్పలేదు. పది మంది చేరి ఒక నిశ్శబ్ద వాతావరణంలో నాటకం రిహార్సిల్సు చేసుకునేందుకు స్థలం కరువయింది. చారిత్రాత్మక నాటికలు వేయాలన్నా, నాటక సామగ్రి సమకూర్చుకోవటం ఒక సమస్య అయికూర్చుంది. అంతే కాదు, స్త్రీ పాత్రలకి స్త్రీలనే తీసుకురావటమూ కష్టమయింది.

కొద్ది కాలంలోనే, ఎదురైన అడ్డంకులన్నిటినీ తేలికగా మార్చి, సమాఖ్య ముందడుగు వేసింది. పలువురు ఉత్సాహవంతుల్ని ఆకర్షించింది. బ్రిగేడియర్ ఎస్. కె. రావు, శ్రీయుతులు మొసలికంటి తిరుమలరావు, డాక్టరు ఎ. వి. రావు, శ్రీమతి వేదకుమారి వంటి పుర ప్రముఖులు సమాఖ్య "తమదే" అనుకున్నారు. శ్రీమతులు జి. సుభద్ర, వరలక్ష్మి రామస్వామి, కుమారి డి. అరుణ, మంజువాణి, విశాల, జయలక్ష్మి మొదలైన స్త్రీలు మొదటిసారిగా రంగస్థలం మీదికి వచ్చి తమ నటనా చాతుర్యంతో ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేశారు. ఢిల్లీలోని ఆంధ్రుల సంఖ్యతో పోలిస్తే, నూరుగురి సభ్యత్వం సమాఖ్యకు తక్కువగానే తోచవచ్చు. కాని ప్రత్యేక కళాభిరుచీ, ఉత్సాహము గలవారే సమాఖ్యకి సారథ్యం వహించటం జరిగింది. నేటి వరకూ ఈ సమాఖ్యని నడుపుతున్న గౌరవం — కళాపిపాస, ప్రాంతీయాభిమానం, చురుకుదనం గల చాకుల్లాంటి యువకులది.

నగరంలో విశేష ప్రచారాన్నందుకుంటున్న హిందీ, బెంగాలీ, పంజాబీ, తమిళం, కన్నడ నాటక సమాజాలకున్న స్థానిక బలం, అవకాశాలు సమాఖ్యకు లేవు. కాని ప్రదర్శనల విషయంలో పాత్రికేయుల, విజ్ఞుల మన్ననలనందుకోవటంలో ఏ మాత్రం వెనుక పడలేదు. మచ్చుకి, 'ఫణి', 'దైవశాసనం', 'భయం', 'కీర్తిశేషులు' విశేష ప్రజాదరణపొందాయి. ఈ తొమ్మిది సంవత్సరాలలో సమాఖ్య యాభయి నాటకాలని ప్రదర్శించింది. ఇందు సహజ నటన, ప్రతిభ కనబరిచి, కేవలం నాటక ప్రదర్శనాలే కాక, నృత్య గానాలు, బుర్రకథలు, కవాలీలు, బొమ్మలాటలు, ఏకపాత్రాభినయం, ప్రసిద్ధ కళాకారులకి సన్మాన సభలు వంటి కార్యక్రమాలు జరపటానికి సమాఖ్య సంకల్పించింది. శ్రీయుతులు పర్వతనేని వీరయ్యచౌదరి, బాలమురళీకృష్ణ, అన్నవరపు రామస్వామి, ఘంటసాల గానం, శ్రీమతి లలితాశాస్త్రి శిష్యురాండ్రైన కుమారి అరుణారావు, లలితారావు వంటి బాలికల ముచ్చటగొలిపే నృత్యాలు ఈ నాడు ఢిల్లీలోని ప్రవాసాంధ్రుల అందుబాటుకి వచ్చాయంటే, అది సమాఖ్య చలవే. కీ. శే. రఘుపతి వెంకటరత్నం నాయుడు, వీరేశలింగం పంతులు, గురుజాడ అప్పారావు, బళ్ళారి రాఘవ వంటి ప్రముఖుల స్మారకసభలు కూడా జరిపించింది సమాఖ్య. 1962 వ సం. చైనాదేశం దాడిచేసిన సందర్భంలో జాతీయ రక్షణ నిధికి రు. 2600 విరాళ మిచ్చింది. ఢిల్లీ నాట్య సంఘం ఆధ్వర్యాన జరిగిన నాటక పోటీలలో సమాఖ్య ఒక ఉత్తమ నటుణ్ణి కూడా అందించింది.

శ్రీ కోటా సుబ్బారావుగారు దీవించినట్లు, సమాఖ్య దినదినాభివృద్ధిచెందుతూ ఆంధ్రమాత కళాసంపత్తిని, సాంస్కృతిక ప్రతిభని, పలు ముఖాలలా వ్యాపింపచేస్తుందని ఆశిద్దాము.

వార్షికోత్సవ సందర్భంలో, "వాన వెలిసింది", "పరాత్మదేవ భవ" అను రెండు చక్కని నాటకాలు ప్రదర్శింపబడ్డాయి. కుమారి ఎస్. లలితారావు తన భరతనాట్యంతో ప్రేక్షకుల్ని ఆనందపరచింది. ●

# ర మా ప్ర భ



"నాటకానికీ సినిమాకీ సంబంధం ఏమిటి? ఎక్కడా పోలిక ఉండదు. నాటక రంగస్థల అనుభవాలు సినిమారంగానికి ఏవీ ఉపకరించవు. ఆ పద్ధతులు వేరు. ఈ పద్ధతులు వేరు. అంచేత మేం సరాసరి సినిమాల్లోకి వచ్చి చేయగలం'' అంటున్నారు, యీటీవల కొత్తగా వస్తున్న కొందరు.

వాదానికి నిలవని యీ వాక్యాలు విని మనం తెలియనితనం చేత అంటున్నారని సరిపెట్టుకొని సంతృప్తిపడవలసి వస్తుంది. నాటకాలు ప్రదర్శించే ధోరణిలోను, సినిమాలు తీసే విధానంలోను మార్పు ఉండవచ్చును. ఇతివృత్తాలు వేరయి ఉండవచ్చును కాని, నటన ఒక్కటే! వివిధ రసానుభూతుల్ని మననం చేసుకుని ప్రకటించాలి. నటించాలి. ఆ నటనలో జీవించాలి. నటన అనేది నాటకానికి ఎంతో సినిమాకీ అంతే!

నాటకరంగంలో తగినంత అనుభవం ఉంటేనేగాని, వెనక సినిమాల్లోకి తీసుకునే వారుకాదు. ఇపుడు మన అగ్రశ్రేణి తారలుగా పరిగణించబడుతున్న వారందరికీ రంగస్థలానుభవం ఉన్నదనే చెప్పవచ్చును. అందుకే వారినీ, వారి నటననూ కొత్తగా సరికొత్తగా చూసి ఆనందించగలుగుతున్నారు ప్రేక్షకులు.

ఇంతకీ చెప్ప వచ్చేదేమిటంటే నాటకరంగంలో విశేషమయిన అనుభవం ఉండటం వల్లనే రమాప్రభ యివాళ ఎనిమిది చిత్రాల్లో నటిస్తున్నది. నాటకరంగ స్థల అనుభవాల సంపుటే ఆమెను తీర్చిదిద్ది, చక్కని నటిగా తయారు చేసింది.

* * *

ప్రత్యగాత్మగారి "చిలకా గోరింకా' చిత్రంలో శ్రీ పద్మనాభం పక్కన హాస్య భూమికలో ఆంధ్రప్రేక్షకులకు పరిచితమయిన కుమారి రమాప్రభ 1947 అక్టోబరు 5న కదిరిలో జన్మించింది. మదనపల్లికి సమీపాన గల వాయల్పాడు ఆమె స్వగ్రామం. పెరుగుదలఅంతా మదరాసులో— అంటే రాజమ్మగారి సంరక్షణలో. మైలాపూర్‌లో గల సెంట్ థామస్ కాన్వెంటులో చదువుకున్నది.

బాల్యం నుంచీ రమాప్రభ నాటకాలలో పాల్గొంటున్నది. ప్రసిద్ధ తమిళ నటులు మనోహర్, తంగవేలు మొదలయినవారి నాటక సమాజాలలో చేరి నేటికీ నటిస్తున్నది. ఆ సమాజాలు ప్రదర్శించే నాటకాలలో నటించడం వలన కుమారి రమాప్రభకు గుర్తింపు రావడమే గాక ప్రజల నుంచి ప్రశంసలు, బహుమతులు అనేకం గెలుచుకుంటూ వస్తున్నది.

రమాప్రభకు డాన్స్ ట్రూపు కూడ వున్నది. తన బృందంతో పలుచోట్ల నృత్య ప్రదర్శనలు యిచ్చింది. నటనలోనే గాక నాట్యంలో కూడ చక్కటి ప్రావీణ్యతను సంతరించుకున్న కుమారి రమాప్రభకు ప్రఖ్యాత నటి శ్రీమతి సావిత్రి మీద గురి ఎక్కువ. సావిత్రి అన్నా, ఆమె నటన అన్నా ఎంతో మక్కువ.

రమలో అందం ఉంది. ఆకర్షణ ఉంది. అన్నింటినీ మించిన మంచితనం ఉంది. సాటివారిని సానుభూతితో అర్థం చేసుకొనగల సహృదయం ఉంది. హుషారుగా ఉన్నప్పుడు తనలో తను పాడుకొంటూ ఉంటుంది. తీరికవేళల్లో కొత్తచిత్రాలు చూస్తూ ఉండటం, స్విమ్మింగ్‌కి వెళ్లటం పుస్తకాలు చదువుకోవటం రమాప్రభకు అలవాటు.

అడుగుజాడలు, డాక్టర్ ఆనంద్, ప్రేమలో ప్రమాదం, రతీ మన్మథ, అయినవారు కానివారు, సెల్వం (తమిళం) కాదల్ పడుత్తుం పాడు (తమిళం) కన్యకాపరమేశ్వరి (కన్నడం) ప్రస్తుతం రమాప్రభ నటిస్తున్న చిత్రాలు. తెలుగు, తమిళ, కన్నడ, హిందీ భాషల్లో చక్కని పరిచయం ఉన్నదీమెకు.

"చీకు చింతల్లేని ప్రశాంత జీవితం గడపాలని వుంటుందండీ నాకు'' అంటుంది నవ్వుతూ రమాప్రభ. నటించాలనే ఉత్సాహం, నటనలో కృషి అనుభవం ఉన్న రమాప్రభ వంటి చక్కని నటీమణులను ప్రోత్సహించవలసిన అవసరం పరిశ్రమకు ఉన్నది.

—మోహన్‌కుమార్



"అడుగుజాడలు'' లో రమాప్రభ, చలం.




నవజ్యోతి ఫిలిమ్స

# అడుగుజాడలు

స్క్రీన్‌ప్లే-డైరెక్షన్:చాణక్య

నిర్మాతలు:M.సాంబశివరావు·G.వందనం

వాణీ రిలీజ్

Roopkala

VIJAYA

# చిత్రలహరి

## బ్లూక్రాస్ ఆఫ్ ఇండియాకి జమున తోడ్పాటు!

మనుషులు ప్రమాదాలకు గురి అయి నప్పుడు ఆదుకునే 'రెడ్‌క్రాస్' వలెనే జంతువులను ఆదుకునేందుకు 'బ్లూక్రాస్ ఆఫ్ ఇండియా' అనే సంస్థ ఒకటి మద్రాసులో ఉన్నది. విదేశాల్లో యివి బాగా అభివృద్ధి చెందినవి. మనదేశంలో అంత ఎక్కువగా లేవు. కెప్టెన్ సుందరం ఆధ్వర్యంలో నిర్వహింపబడుతున్న యీ బ్లూక్రాస్ సంస్థ ఒక ఆసుపత్రిని కూడ నడుపుతున్నది. జంతువులను పట్టి క్రూరంగా హింసిస్తుంటే యీసంస్థ తరఫు మనుషులు వెళ్ళి, వాటి బాధ నివారిస్తారు. సహజంగా జాలిగుండె కల ప్రసిద్ధ నటి శ్రీమతి జమునను యీ ఉద్యమం ఆకర్షించి ఆకట్టుకున్నది. తనంతట తనే ఎంతో శ్రద్ధ తీసుకొని బ్లూక్రాస్ తరఫున ఆమె వాలంటీర్‌గా పని చేస్తున్నది. తన తోడ్పాటును యితోధికంగా అందజేయడమేగాక యింతవరకు శ్రీయుతులు యన్. టి. రామారావు, ఆదుర్తి సుబ్బారావు, తాపీ చాణక్య, ప్రాణ్, శ్రీమతి నూతన్, ప్రసాద్ ప్రొడక్షన్స్ వారిని యిందులో సభ్యులుగా చేర్పించి దాని పురోభివృద్ధికి ఎంతగానో సహకరిస్తున్నది జమున.

ఈ సంస్థలో మొత్తం 100జంతువులు ఉన్నవి. శ్రీమతి జమున చేరేనాటికి ఆ సంస్థ ఆర్థికంగా అంతంత మాత్రంగానే ఉండేది. ఆమె కల్పించుకున్న తర్వాత ఆ మొత్తం బాగా పెరిగిందనే చెప్పాలి. "ఈ సంస్థకు పెద్దఎత్తున ఏదేనా సహాయం చేయాలని ఉందండీ! ఏ పద్ధతిలో చేస్తే బావుంటుందా అని ఆలోచిస్తున్నాను. ఇంకా ఒక నిర్ణయానికి రాలేదు. రాగానే తప్పకుండా చేస్తాను!" అన్నది శ్రీమతి జమున ఆనందంగా. జంతువుల పట్ల యింత కారుణ్యంగల ఆమె సహృదయత, సత్ప్రయత్నాలు హర్షించదగినవి.

## మధుపిక్చర్స్ చిత్రం

శ్రీ విఠలాచార్య మామూలుగా తీసే జానపద చిత్రాలకీ యిపుడు మధుపిక్చర్స్ వారికి తీస్తున్న జానపదానికీ ఎంతో వ్యత్యాసం ఉన్నది. పూర్తిగా కొత్త పద్ధతిలో నిర్మించబడుతున్న యీ చిత్రంలో కాంతారావు, కృష్ణకుమారి, కృష్ణ, సంధ్యారాణి, సుకన్య, రమణారెడ్డి, యస్. వి. రామదాసు, ధూళిపాళ, రావికొండలరావు, పుష్పకుమారి, నెల్లూరు కాంతారావు ముఖ్యభూమికలు పోషిస్తున్నారు. ఇందులో నెల్లూరు కాంతారావు ప్రత్యేకమయిన భూమికలో, చిత్రమయిన వేషధారణలో ప్రేక్షలకు చూపబోతున్నారు. ఇంతవరకు అయిదు పాటలు రికార్డు చేశారు. వాటిని రాసింది వేటూరి, ఆరుద్ర, దాశరధి, నారాయణరెడ్డి. మరో రెండు పాటలు, నాలుగు పద్యాలు రికార్డు చేయవలసి వున్నది. "ఇంతవరకు అయిదు రీళ్ళ చిత్రం పూర్తి అయింది. నవంబరు 15 నాటికి విడుదల చేయాలనుకొంటున్నాము" అన్నారు, నిర్మాత శ్రీ పి. మల్లికార్జునరావు.



"ప్రేమతో ప్రమాదం"లో జ్యోతి

## కృష్ణ కొత్తచిత్రాలు

ఇటీవల విడుదలయిన కన్నెమనసులు, గూఢచారి116 చిత్రాలలో నటించి చక్కని పేరు తెచ్చుకున్న కృష్ణ — ఏ. వి. యం. వారు ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న "అవేకళ్ళు" సాంఘికంలో నటించేందుకు యీ మధ్య ఒప్పందంపై సంతకం చేశాడు. ఈ చిత్రంలో అతడి పక్కన కథానాయికగా కాంచన నటిస్తున్నది. ఇంకా మధు పిక్చర్స్, వీనస్ అండ్ పద్మినీ కంబైన్స్, డి. బి. యన్. ఫిలిమ్స్ చిత్రాలలో నటిస్తున్నాడు.

## విఠలాచార్య-ఎక్స్‌పెరిమెంట్

ఇటీవల దర్శకుడు శ్రీ విఠలాచార్యను



"శ్రీ కృష్ణ మహిమ"లో కమలాలక్ష్మణ్, రధ

కలుసుకున్నప్పుడు, ఆయన ఒకకొత్త విషయం చెప్పారు. తాము నిర్మించబోయే, "అగ్గిదొర" చిత్రంలో ఒక్కపాటగాని, ఒక్క నృత్యంగాని ఉండవుట! "ఇది సాహసమే అయినా, నేచురల్ ఎఫెక్ట్స్‌కోసం ప్రయత్నిస్తున్నాను. రీరికార్డింగ్ ఉంటుంది. ఇది కూడ ఒక పద్ధతిలో, ఒకకొత్త పంథాలో చేయించాలని అనుకుంటున్నాను" అన్నారు విఠలాచార్య నవ్వుతూ.

## డి. బి. యన్. ఫిలిమ్స్

డి. బి. యన్. ఫిలిమ్స్‌వారు శ్రీ ముళ్ళపూడి వెంకటరమణ రాసిన ఒక చక్కని కుటుంబ గాథను అన్నితరగతుల వారినీ ఆకర్షించే విధంగా చిత్రంగా తీయబోతున్నారు. రామ్మోహన్, కృష్ణ, కాంచన సుకన్య, గుమ్మడి, రేలంగి, అల్లురామలింగయ్య, పుష్పకుమారి, జయశ్రీ మొదలయిన వారు నటిస్తారు. సంభాషణలు: ముళ్ళపూడి, గీతాలు: ఆత్రేయ, సంగీతం: కె. వి. మహదేవన్, కెమెరా: కె. యస్. రామకృష్ణరావు. ఈ యువఛాయాగ్రాహకుడు శ్రీ పి. యల్. రాయ్ వద్ద చిరకాలం నుంచీ సహాయకుడిగా ఉండి విశేషమయిన అనుభవం గడించాడు. కళ: తోట, దర్శకుడు: కె. విశ్వనాథ్, నిర్మాతలు: డి. బి. నారాయణ, టి. వి. యస్. శాస్త్రి. షూటింగ్ అక్టోబరు చివరివారం నుంచి ప్రారంభిస్తారు.

## ప్రేమలో ప్రమాదం

సుగుణ అకస్మాత్తుగా ఒక రోజు



"సత్యమే జయం"లో రాజశ్రీ



"డాక్టర్ ఆనంద్" లో కాంచన

రాత్రి ఆఫీసులో రాజును కలుసుకుంది. అతన్నీ, అతని కదలికల్నీ చూసి ఆశ్చర్య పడ్డది. అనుమానాస్పద మయిన దృక్కులతో అతనికేసి చూస్తున్నది. "సుగుణా! ఆశ్చర్యంగా ఉందా?" అడిగాడు. "లేదు! ఖూనీ చేసినవాడి ఎదుట నిలుచున్నందుకు సిగ్గు పడుతున్నాను" అన్నది సుగుణ స్వాభిమానంతో. సిగ్గుతో చితికి పోయాడు రాజా. "నువ్వూ నన్ను అనుమానిస్తున్నావా?" అని అడిగాడు క్రుంగిపోతూ. "ఇందరూ నిన్ను అనుమానించినప్పుడు నాకు అనుమానమే లేదు. కాని యిప్పుడు నిన్ను ఈ స్థితిలో చూస్తే అనుమానం కలుగుతూంది.... నిరపరాధి వయినప్పుడు ఎందుకిలా దాక్కోవడం?" సుగుణ గొంతులో దుఃఖం పెల్లుబుకుతున్నది. "ప్రాణానికి ప్రాణ మయిన నువ్వే నన్ను అనుమానిస్తున్నపుడు— పోలీసులెలా నమ్ముతారు?" "ఎన్నాళ్ళిలా దాక్కుంటావ్?" "నిజం తెలిసేవరకూ!" అంటూ బదులు చెప్పాడు, నిరూపించుకోలేని పరిస్థితులను తలచుకొని దిగులు పడుతూ. నమ్మలేనన్నట్లు చూస్తూ "నువ్వు నిజంగా ఖూనీ చెయ్యలేదా?" అన్నది. రాజుకి చిరాకు వేసింది. ప్రాణాధికంగా ప్రేమించిన సుగుణే తనను అనుమానపు తెరల్లోంచి చూస్తూ అవమానపరుస్తూ ఉండడం రాజా సహించలేక "సుగుణా! కోపం కూడదని నిశ్చయించుకున్నాను. కాని, నా నిశ్చయానికి భంగం కలిగే విధంగా నువ్వు నన్ను రెచ్చగొడుతున్నావ్! ఛ...ఛ... పోయి పోయి ఒక ఆడదాన్ని ఖూనీచేయడం?" అన్నాడు. "హాయమీద కసి తీర్చుకోక పోతే మనశ్శాంతి వుండదన్న నీ మాట నేనింకా మరచిపోలేదు!" అన్నది సుగుణ. రాజా కుపితుడయినాడు. "సుగుణా, అవును సుగుణా! నేను ఖూనీ చేశాను. కమాన్" అంటూ ఆమెను ఫోన్‌దగ్గరికి లాక్కెళ్ళి ఫోన్ అమెకిస్తూ "ఇదిగో, ఫోన్‌చేసి పోలీసుల్ని పిలు!" అన్నాడు. సుగుణకి అభిమానం పొడుచుకొచ్చి "నేనెందుకు పోలీసులకు తెలపాలి! ముందిక్కడ నుంచి వెళ్ళు! నువ్విక్కడున్నావని తెలిస్తే మా నాన్నకు ప్రమాదం!!" అన్నది. "నేను యిక్కడ ఉండడానికి రాలేదు... దాచుకున్న డబ్బు తీసుకు వెళదామని వచ్చాను" అంటూ సమాధాన మిచ్చాడు రాజు. "తీసుకున్నావుగా, ఇంకా నిలబడ్డావేం?" అన్నది కఠినంగా సుగుణ.— రసవత్తరమయిన



"మనసేమందిరం"లో నాగేశ్వరరావు, సావిత్రి, జగ్గయ్య

# చిత్రలహరి

యీ సన్నివేశం సిటాడల్ వారి "ప్రేమలో ప్రమాదం" చిత్రంలోనిది. సుగుణ కృష్ణ కుమారి, రాజు రామకృష్ణ, రాజనాల, చదలవాడ కుటుంబరావు, చలం, రాజు బాబు, జయంతి, వాణిశ్రీ, సూర్యకాంతం విజయలలిత, రమాప్రభ, రావికొండల రావు మున్నగు వారు కూడా యీ చిత్రంలో ముఖ్య భూమికలు పోషించారు. రచయిత: ముద్దుకృష్ణ, నిర్మాత: దర్శకుడు: జోసెఫ్‌తలియత్.

## సెట్టూ-అవుట్ డోరూ లేకుండా పాట చిత్రీకరణ

ప్రసిద్ధ దర్శకుడు శ్రీధర్ వద్ద సహకార దర్శకుడుగా ఉండి అనుభవం గడించిన, ఆయన సోదరుడు శ్రీ సి. వి. రాజేంద్రన్ యిప్పుడు దర్శకుడయినాడు. ఆ చిత్రం పేరు "అనుభవం పుదుమై". సెట్టూ అవుట్ డోరూ లేకుండా ఈ యువదర్శకుడు యిటీవల ఒకపాట చిత్రీకరణ జరిపారు. ఇది అద్భుతమయిన ఒక కొత్త ప్రయోగం. అభ్యుదయ భావాలు గల యువచిత్రకారుడు భరణికుమార్, దర్శకుడు కలిసి రూపొందించిన స్కెచ్‌ల ప్రకారం ఈ పాటకు అరవై షాట్స్ తీశారు. మేధాసంపద చక్కని ఊహాశక్తి గలిగిన ఈ యువకులు ప్రేక్షకులకు ఈ చిత్రం ద్వారా కొత్తదనం చూపుతున్నారు ఈ చిత్రీకరణలో రాజశ్రీ, ముత్తురామన్ పాల్గొన్నారు. ఛాయాగ్రాహకుడు విన్సెంట్, సహాయకుడు సుందరం.

## శ్రీకృష్ణావతారం

తారకరామా పిక్చర్స్‌వారి "శ్రీకృష్ణావతారం" మొదటి షూటింగు షెడ్యూలులో సత్యభామ శ్రీకృష్ణుల యుగళగీతం కృష్ణుడు రుక్మిణితో సంభాషించటం, చవితి చంద్రుణ్ణి చూడటం మొదలయిన దృశ్యాలను చిత్రీకరించారు. శ్రీకృష్ణుడు యన్. టి. రామారావు రుక్మిణి దేవిక, సత్యభామ కాంచన. మిగిలిన ముఖ్యభూమికలలో యస్. వి. రంగారావు, కాంతారావు, రాజనాల, ధూళిపాళ, ముక్కామల, మిక్కిలినేని, వేమూరి రామయ్య ఉన్నారు. దర్శకుడు, కమలాకర కామేశ్వరరావు, నిర్మాతః ఏ. పుండరీకాక్షయ్య.

## శ్రీమతి

శ్రీనిలయం పిక్చర్స్, వారి 'శ్రీమతి' చిత్రం రష్షెస్ తాలూకు కొన్నిభాగాలు వినాయక చవితి రోజున వాహినీ 'బి' థియేటర్లో చూడటం జరిగింది. ఈ చిత్రం ద్వారా యీ సంవత్సరం మరో కొత్త దర్శకుడు పరిచయం అవుతున్నారు. ఆయన పేరు విజయారెడ్డి. వయసులో చిన్నవాడయినా, ఇది అతడికి తొలిచిత్రమయినా ఎంతో ప్రతిభావంతంగా తీశాడనిపిస్తుంది. శ్రీ నిత్యానంద్ సంగీతం, శ్రీకాంత్ ఛాయాగ్రహణం కొత్తదర్శకుడు విజయారెడ్డికి "శ్రీమతి" చిత్రం సముజ్వలమయిన భవిష్యత్తును ఏర్పరుస్తుంది.



"శ్రీమతి"లో శారద

ఈ చిత్రంలో కాంతారావు, అల్లు రామలింగయ్య, చలం, సత్యన్నారాయణ, బాలకృష్ణ, శారద, వాసంతి, గీతాంజలి, సూర్యకళ, మీనాకుమారి, నిర్మల మొదలగువారు నటించారు.

## మోహినీ భస్మాసుర

విష్ణువు మోహినిగా మారాడు. సమ్ముఖంలో ఉన్న మోహినిని చూడగానే భస్మాసురుని చిత్తం వశం తప్పింది. "ప్రశాంతమ్మే



"అడుగుజాడలు"లో చలం, రమాప్రభ

విశేషము, ప్రపంచమే నికుంజము, పూవులో పూవునై పూయనా, ఆకులో ఆకునై ఆడనా" అంటూ పాడుతూ అతన్ని కవ్విస్తున్నది. ఆ కవ్వింపు భస్మాసురుడి మతిని మరింత భ్రమింప చేస్తున్నది. ఆమెను అందుకోవాలనే ప్రయత్నం చేశాడు. అందకుండా మేఘాల మధ్యకు వెళ్లి ఆడుతున్నది. "నీనీల మేఘ మాలలో తారనై, వినోదభావ గీతిలో నాదమై, విశాల ప్రేమసీమలో దేవినై— హసించి మించి వన్నెలాడి నేనే" అంటూ ఆలపిస్తూ అభినయిస్తున్నది మోహిని. శృంగార రస ప్రధానమయిన యీ సన్నివేశం బి. ఏ. యస్. ప్రొడక్షన్స్‌వారి "మోహినీ భస్మాసుర' చిత్రానికిగాను గతనెల 19,20 తేదీల్లో జెమిని స్టూడియోలో చిత్రీకరించారు. ఈసన్నివేశ చిత్రీకరణకు "హైస్పీడ్" కెమెరాను ఉపయోగించి రమణీయంగా స్పెషల్ ఎఫెక్ట్స్‌తో తీసినది రవికాంత్. ఈ హైస్పీడ్ కెమెరా దక్షిణభారతంలో ఒక జెమినిలోనే ఉన్నది. పై గీతాన్ని రాసినది ఆరుద్ర. మధుర మనోజ్ఞంగా ఆలపించిన కంఠం పి. సుశీలది. చక్కని వరుస చేసి సంగీతం సమకూర్చినది యస్. రాజేశ్వరరావు. మోహినిగా పద్మిని, భస్మాసురుడిగా యస్. వి. రంగారావు నటించారు. మిగిలిన ముఖ్యభూమికల్లో కాంతారావు, బాలయ్య, ధూళిపాళ, రామకృష్ణ, కె. రఘురామయ్య, అనురాధ, కళ్యాణి ఉన్నారు. రేలంగి, రమణారెడ్డి, పద్మనాభం, అల్లురామలింగయ్య అతిథి నటులుగా పాల్గొంటున్నారు. రచన: గబ్బిట వెంకటరావు. వాలి కళాదర్శకత్వం నిర్వహిస్తున్న యీ చిత్రం ఆంధ్రలో దీపావళికి నవయుగ ఫిలిమ్స్ ద్వారా విడుదల కానున్నట్లు తెలుస్తున్నది. నిర్మాత, దర్శకుడు: బి. ఏ. సుబ్బారావు.

## సినిమా రచయిత్రిగా 'లత'

ప్రసిద్ధ నవలా రచయిత్రి శ్రీమతి లత యిప్పుడు సినిమా రచయిత్రి అయింది. ప్రస్తుతం శ్రీ డి. యల్. నిర్మించనున్న "ఏకవీర" చిత్రానికి సంభాషణలు రాస్తున్నది. ఆమె నవలలు "మోహనవంశి", "ఉమర్‌ఖయ్యాం" చిత్రాలుగా నిర్మించేందుకు ఇరువురు ప్రముఖులు ప్రయత్నిస్తున్నారు.

## మనసే మందిరం

"ఈ వేళప్పుడు మీ కిబ్బంది కలిగిస్తున్నందుకు మన్నించండి డాక్టర్!" అన్నాడు రాము. ఒంటరిగా గదిలో కూచుని చదువుకుంటున్న రఘు దగ్గరికి వచ్చి డాక్టర్ రఘు కళ్లెత్తి చూసి, మనఃపూర్వకంగా అతన్ని ఆహ్వానిస్తూ "అదేం లేదు రామూ, ఏమిటో చెప్పండి!" "ఏం లేదు డాక్టర్! ఆపరేషన్ చేస్తే నేను బ్రతుకుతానంటారా? డాక్టర్.. నేను పిరికివాణ్ని కాను. నిష్ఠురమైన నిజాన్ని భరించగల గుండె నిబ్బరం కలవాణ్ని. దాపరికం లేకుండా చెప్పండి. అడిగాడు. "మీకు తప్పక నయమవుతుందనే నమ్మకం నాకు దృఢంగా వుంది" చెప్పాడు డాక్టరు రఘు. "మీరనుకున్న దానికి విరుద్ధంగా నేను చనిపోవడమే జరిగితే..?" "అలా ఎన్నటికీ జరుగదు, రాం!" అభయమిచ్చాడు రఘు. "జరిగితే డాక్టర్! ప్రశాంతంగా గడచిన నా జీవితం ప్రశాంతంగానే ముగిసిపోవాలి. చావులో కూడా నాకే కొరతా వుండకూడదని నా కోరిక. నా భార్య వయసులో ఉంది. ఈ వయస్సులో ఆమెకు వైధవ్యం ప్రాప్తించడం హృదయం ఉన్న వాళ్లెవరూ హర్షించరు." అన్నాడు రాము ఆవేశపూరితుడయి. "ఆ దౌర్భాగ్యం ఆమెకు ఎన్నడూ ఏర్పడదు. రాం!" "డాక్టర్, మీరు నాకొక వాగ్దానం చెయ్యాలి." అన్నాడు ఒక నిశ్చయానికి వచ్చి. "వాగ్దానమా?" ఆశ్చర్యంతో నొసలు పైకెత్తి అడిగాడు డాక్టర్ రఘు. హృదయాలను స్పందింప చేసే యీ సన్నివేశం శ్రీకృష్ణ సాయి ఫిలిమ్స్ వారి "మనసే మందిరం" చిత్రంలోనిది. నాగేశ్వరరావు, సావిత్రి, జగ్గయ్య, గుమ్మడి, రేలంగి, చలం గిరిజ, నిర్మల శాంతకుమారి, బేబి శాంతి కళ, నాగభూషణం, శారద ముఖ్యభూమికలు పోషించారు. రచన: ఆత్రేయ, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: శ్రీధర్, నిర్మాత: శ్రీ యర్రా అప్పారావు.

—మోహన్‌కుమార్



"భూలోకంలో యమలోకం" చిత్రంలో యముడుగా ప్రేక్షకులకు పరిచయం కాబోతున్న కొత్త నటుడు పచ్చల సాంబశివరావు

## ఎమ్. ఎస్. సుబ్బులక్ష్మి అమెరికా పర్యటన

1966 'యునైటెడ్ నేషన్స్ డే' సందర్భాన్ని పురస్కరించుకుని ఐక్యరాజ్య సమితి సమావేశంలో అక్టోబరు ఇరవై మూడున సంగీత కచ్చేరీ చేసేందుకు శ్రీమతి యమ్మెస్ సుబ్బులక్ష్మి బయలుదేరి వెళ్లారు. వీరు సమితి సమావేశంలో గంటన్నరసేపు కచ్చేరీ చేయనున్నారు. ఈ విశేషమైన కార్యక్రమం శ్రీమతి సుబ్బులక్ష్మికే కాకుండా యావద్భారత దేశానికి కీర్తిదాయకమై వివిధ దేశాల్లో మనదేశ సంగీత సాహిత్యాలకు గల మెప్పుకోలును చాటుతున్నది.

శ్రీమతి సుబ్బులక్ష్మి విస్తృతమైన యీ ఏడువారాల పర్యటనలో యింకా అప్పటప్పట వివిధ నగరాల్లో కచ్చేరీలు జరిపి మళ్లీ డిశంబరు ఐదున స్వదేశానికి తిరిగి వస్తారు.

భారతదేశంలో శ్రీమతి సుబ్బులక్ష్మి పేరు వినని వారంటూ వుండరు. ఆమె స్వరసంగీతానికి సరస్వతీదేవి. సుశ్రావ్యమైన గాత్రంతో శ్రోతల్ని మైమరపించి పరవశింప జేయగల శక్తి ఆమెకున్నది. మీరాబాయి గీతాలాలపించినప్పుడు శ్రీమతి సరోజినీ నాయుడు ఒకప్పుడు ఆమెను 'సంగీతరాజ్ఞి, సర్వజనమనోరంజని' అన్నారు అంటే ఆశ్చర్యంలేదు. 1956 లో శాస్త్రీయ కర్ణాటక సంగీతంలో రాష్ట్రపతి బహుమానాన్ని పొందిన శ్రీమతి 'యమ్మెస్' 1954 లో 'పద్మభూషణ్' బిరుదాన్ని తీసుకున్నప్పటికంటే ఎంతో ముందుగా మనదేశంలో ముఖ్యంగా దక్షిణాదిన ఆమె పేరు యింటింటా చెప్పుకున్నారు.

శ్రీమతి యమ్మెస్ సుబ్బులక్ష్మి సకుటుంబమైన ఈ విదేశీ పర్యటనలో ఆమెకు సహాయకులుగా —రాధా విశ్వనాథన్ (గాత్రం,) విజయ రాజేంద్రన్ (తంబుర), వి.వి. సుబ్రహ్మణ్యం (వయొలిన్), టి. కె. మూర్తి (మృదంగం), టి. హెచ్. వినాయకరావ్ (ఘటం) పాల్గొంటున్నారు.

# హస్తకాలం

## సుబ్రహ్మణ్యభారతి

భాషా రాష్ట్రవాసులుగావుంటున్న మనం, ఇతర భాషలను నేర్చుకోవడం వారి సంస్కృతి, సాహిత్య చరిత్ర, చరిత్రకారుల్నిగురించి తెలుసుకోవడం భావ సమైక్యతకు ఎంతైనా అవసరం. తమిళ సారస్వత చరిత్రలో చిరంజీవరచయిత సుబ్రహ్మణ్యభారతిపై శ్రీ చల్లా రాధాకృష్ణశర్మ రచన ఈ ధ్యేయాన్ని కొంతవరకు నెరవేరుస్తుంది. ముప్పైతొమ్మిది సంవత్సరాలు మాత్రమే జీవించి తమిళ వాఙ్మయాన్ని సుసంపన్నంచేసి ప్రపంచ వ్యాప్తమైన కీర్తి గడించిన జాతీయవాది సుబ్రహ్మణ్య భారతి. తెలుగు, తమిళము బాగా ఎరిగివున్న శ్రీ రాధాకృష్ణశర్మ భారతి జీవిత కథను తెలుగు వారికి పరిచయం చేయడంలో కృతకృత్యులైనారనే చెప్పాలి. జీవిత చరిత్రను వివిధమైన భాగాలుగా చేసి తేటతెల్లంగా చెప్పడమేకాకుండా, భారతి రచనల్ని కూడా కొన్నిటిని తెనిగించి సంపుటీకరించారు. భారతి రచనారీతికి భావ సంపన్నతకు దర్పణంగా వుంది ఈ గ్రంథం. మరో విశిష్టమేమిటంటే తమిళ నవ యుగకర్త భారతిని, తెలుగు నవయుగకర్త గురుజాడని పోల్చిచెప్పడం. సంఘసేవకులుగాను, వ్యావహారిక భాషావాదులుగాను పేరు తెచ్చుకున్న వీరిని జోడించి గ్రంథానికి వన్నె తీసుకువచ్చారు రచయిత. గ్రంథాంతంలో భారతి జీవితంలోని కొన్ని ముఖ్య సంఘటనలుకూడా యివ్వబడ్డాయి. ఇందులో కొన్ని భాగాలు ఇదివరలోనే ప్రముఖ పత్రికలలో ప్రచురింబడినాయి. కూర్పు అందరూ చదివి ఆనందించతగ్గవిధంగా వుంది. ఇలాంటి రచనలు జాతీయ సమైక్యతకు చిహ్నాలుగా వుంటాయి.

అమూల్యమైన, రెండు రూపాయిలకే లభించే యీ 122 పేజీల ముచ్చటైన పుస్తకం దొరికే చోటు: 5, నాగార్జున నగర్, మద్రాసు—24.

—సికరాజు

**అవీ-ఇవీ...**

## రాంచీలో వేణుమాధవ్

రాంచీ ఆంధ్రా అసోసియేషన్ ఆధ్వర్యమున ప్రముఖ మోనోయాక్టర్ మరియు వెంట్రిలాక్విస్టు శ్రీ వేణుమాధవ్ ప్రదర్శన ఆగస్టు 25 వ తేదీన రష్యన్ హాలులో బీహార్ రాష్ట్రగవర్నర్ శ్రీ అనంతశయనం అయ్యంగార్ గారి సమక్షమున జరిగినది. రాంచీ ఆంధ్రా అసోసియేషన్ అధ్యక్షులు, శ్రీవిఎస్.కృష్ణమూర్తిగారు(జనరల్‌మేనేజర్, హెచ్. ఎమ్. ఓ. సి.) శ్రీ వేణుమాధవ్‌ను సభికులకు పరిచయం చేసి, వారికి పూలమాల వేశారు. తరువాత శ్రీ వేణు మాధవ్ గారి ప్రదర్శన జరిగినది. వీరి ప్రదర్శన ఆంధ్రులను, ఔత్సాహికులను మరియు రష్యన్‌లను ముగ్ధులను చేసినది.

కార్యదర్శి శ్రీ ఏ. అప్పారావు గారు ఆహుతులకు కృతజ్ఞత అందచేశారు. (ఒ. వి.)

## బెంగుళూరు తెలుగు విజ్ఞానసమితి

తెలుగు విజ్ఞాన సమితి, బెంగుళూరు ఆధ్వర్యాన శ్రీ రావికొండలరావు రచించిన, దర్శకత్వం వహించిన "పట్టాలుతప్పిన బండి" నాటకం రవీంద్ర కళాక్షేత్రలో ప్రదర్శింప బడినది.

మైసూరు గవర్నరు శ్రీ గిరి, వారి శ్రీమతి, శ్రీ అన్నారావు సభకి ముఖ్యాతిథులు. సమితి అధ్యక్షులు శ్రీ జోగారావు స్వాగతం పలికారు. వాణీ ఫిలిమ్సు అధినేత శ్రీ సురేంద్రనాథ్ కార్యక్రమం నిర్వహించారు. ఆయన సభికులకు, నటీనటులను పరిచయం చేస్తూ, వారికి ముఖ్యాతిథులచే బహుమతులను అంద జేయించారు. ఈ సందర్భమున, బెల్ ఆంధ్ర మహాసభ వారు ప్రదర్శించిన 'లంకెల బిందెలు' నాటకానికి, శ్రీ అన్నారావు షీల్డు బహూకరించారు. చక్కని నాటకాన్ని రసవత్తరంగా ప్రదర్శించిన ఆంధ్ర ఆర్టు వారిని అభినందిస్తూ శ్రీ గిరి రూ. 116/— తమ ప్రత్యేకబహుమానంగా చదివించారు. శ్రీ అనిల్ కుమార్ గారు వందనసమర్పణ చేశారు.

## వివాహం

శ్రీ కె. అరుణాచలం (ప్రముఖ తమిళ రచయిత 'అరుణ్') కుమార్తె సౌభాగ్యవతి జయను ఒ. బుర్రీగారి కుమారుడు చిరంజీవి హెర్బర్ట్ బుర్రికి ఇచ్చి ఘనంగా వివాహం జరిపించారు. నీలగిరిలో పనిచేస్తున్న చిరంజీవి హెర్బర్ట్ బుర్రీ జర్మనీదేశస్థుడు. లెక్చరరుగా పనిచేస్తున్న సౌభాగ్యవతి జయ దక్షిణ హిందుస్థాన నివాసి. దేశాంతర సంబంధమైన ఈ వివాహానికి అనేకమంది విదేశీయులు, స్వదేశీయులు హాజరైనారు. కాంగ్రెసు అధ్యక్షులు శ్రీ కామరాజ్, మద్రాసు పరిశ్రమలమంత్రి శ్రీ ఆర్. వెంకట్రామన్, పురప్రముఖులు యస్. యస్. పార్థసారథి మొదలైనవారు కూడా వధూవరులను ఆశీర్వదించారు.

—సి. కనకాంబరరాజు

**Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S. Sambhu Prasad.**




విజయరాణి